మొత్తమున కిది రోగికిఁ దీపుమందుబలె, భవరోగికి శృఙ్గార రసానుభవంబుతోడనే భగవద్గుణానుభవంబు నలవఱచి, యుండుటంబట్టి, యిది తద్జ్ఞులచిత్తంబునకుఁ దద్దయునింపు సంపాదించున దని నెమ్మది నమ్మెదను.

ఇట్లు

విధేయుఁడు;

ఎ. వి. నరసిమ్హాం పంతులు.

శ్రీరస్తు.

# కలువాయి శతకము

## టీకాతాత్పర్యసహితము.



శ్రీయుతమూర్తి యాశ్రితకల్పభూజంబు
  కరుణాపయోనిధి కలుషహరుఁడు
సచ్చిదానందుండు సర్వజ్ఞుఁ డవ్యయుం
  డప్రమేయుండు మహా మహుండు
ప్రియకింకరునిగ డబ్బీరునర్సును నేలు
  గజరాజవరదుండు ఘన నిభుండు
నా జీవితేశుఁ డై జనార్దనుఁడు నేఁడు
  వన విహారము చేసి వత్తు ననుచుఁ
గీ. జనెను రాఁడయ్యె నేమొ నా సదనమునకు
  క్షణము శ్రీహరి నెడఁబాయఁ జాలనమ్మ
  చెలియ నీవేగి కలువాయి చిన్నికృష్ణు
  తోడుకొని వేగ రాఁగదే తోయజాక్షి॥ 1

టీ. శ్రీయుతమూర్తి=లక్ష్మీదేవితోఁ గూడిన ఆకారము గలవాఁడు. ఆశ్రితకల్పభూజంబు=(తన్నా) చేరినవారికి కల్పవృక్షమును పోలినవాఁడు, కరుణాపయోనిధి=దయకు సముద్రమును పోలినవాఁడు, కలుషహరుఁడు=పాపములను పోఁగొట్టువాఁడు, సత్+చిత్+ఆనందుండు-సత్=మూఁడు పరిచ్ఛేదములచేత శూన్యత్వమును, చిత్=జడతలేమియు, ఆనందుండు=ఆనందమును గలవాఁడు, సర్వజ్ఞుండు=అన్నిటిని దెలిసినవాఁడు, అవ్యయుండు=నాశములేనివాఁడు, అప్ర

మేయుండు=హేతుశూన్యుఁడు, మహామహుండు=గొప్పకుగొప్పయగువాఁడు, ప్రియకింకరునిగన్ =ప్రియదాసునిగా, డబ్బీరు నర్సును=డబ్బీరు నరుసు అను నీ శతకమును వ్రాసినతన్ను, ఏలుగజరాజవరదుండు=పరిపాలించునట్టి గజేంద్రునకు వరము లిచ్చినవాఁడు, ఘననిభుండు=(శ్యామలత్వముచేత) మేఘమునకు సమానుఁడు, నాజీవితేశుఁడైన=నాప్రాణేశ్వరుఁడైన, జనార్దనుఁడు=విష్ణుదేవుఁడు, నేఁడు, వనవిహారముచేసి వత్తును అనుచున్ =వనములయందు తిరిఁగివచ్చెదనని, చనెను=పోయెను, నాసదనమునకున్ =నాయింటికి, ఏమొ రాఁడయ్యెన్ =ఏలనోరాఁడు, శ్రీహరిని, క్షణము=కొంచెము సేపయినను, ఎడఁబాయజాలనమ్మ=వదలియుండలేను (గనుక) చెలియ=ఓసఖీ! నీవు ఏగి=నీవుపోయి, కలువాయి చిన్నికృష్ణున్ =కలువాయి గ్రామమునందలి శ్రీకృష్ణస్వామిని, తోయజాక్షి=తామరవలె కండ్లనుగలిగిన ఓసఖీ! తోడుకొని=పిలుచుకొని, వేగరాఁగదే=శీఘ్రముగారమ్మా.

తా. శ్రీయుతాది ఉత్తమలక్షణలక్షితుఁడగు నా పెనిమిటి, నేఁడు వనవిహారముచేసి వచ్చెదను, అని వెళ్లి యిదివరకు రాఁడు, అతనియెడఁబాసి, ఉండజాలను, కాఁబట్టి, సఖీ నీవు వేగముగాఁబోయి యతనిఁబిలుచుకొనిరా.

సీ॥ వనిత నానాథుండు ♦ వనవిహారము పోవ
నిలుప మునుల్ మ్రొక్క ♦ నిలిచినాఁడొ
విపినభూములుచొచ్చి ♦ వేఁటాడుచున్నాఁడొ
దైత్యుల శిక్షింపఁ ♦ దలఁచినాఁడొ
వలచి యేచానకై ♦ వనమున నున్నాఁడొ
యెవ తెకుఁ గడుబాస ♦ లిచ్చినాఁడొ
యిట్లు నన్నలయించు ♦ నిచ్చతో నున్నాఁడొ
మమత నెచ్చటఁ జేర్చి ♦ మఱచినాఁడొ
గీ॥ కాక నిన్నటిరే యేల ♦ రాకమాను
యేమి! వింతలుగానున్న ♦ వేమిసేతు॥ చెలియ॥ 2

టీ. వనిత=ఓసఖీ! నా నాథుండు=నా పెనిమిటి, వనవిహారము పోవఁగ్=వనములయందు సంచరింపఁ బోవఁగా, మునుల్=ఋషులు, మ్రొక్కఁగ్=సేవించుటకై, నిలుపఁగ్=నిలిపికొనఁగా, నిలిచినాఁడో=అందే దక్కియుండువాఁడో? (లేక) విపినభూములు చొచ్చి=అడవిప్రదేశములయందు ప్రవేశించి, వేఁట ఆడుచున్నాఁడో=క్రూరమృగములను చంపుచున్నాఁడో? (లేక) దైత్యుల శిక్షింపఁగ్=రాక్షసులను దండించుటకై, తలఁచినాఁడో=ఎంచినాఁడో, వలచి=మోహించి, ఏచానకై వనమునఁగ్=ఏస్త్రీకి లోఁబడి, ఉన్నాఁడో, ఎవతెకుఁగ్=ఏస్త్రీకి, కడుబాసలు=మిగుల నమ్మకములను, ఇచ్చినాఁడో=చెప్పినాఁడో, (లేక) ఇట్లునన్ను అలయించు ఇచ్ఛతోఁగ్=ఇవ్విధముగా నన్ను అలసటపెట్టవలయును అనుకోరికతో, ఉన్నాఁడో=ఉండువాఁడో? (లేక) ఎచటఁగ్=ఏతావునందైనను, మమతఁగ్ చేర్చి=తనప్రేమను నిలిపి,మఱచినాఁడో=నన్ను స్మరింపఁడో! కాక=అట్లుగాకున్న, నిన్నటిరేయి=నిన్నరాత్రి, ఏల రాక మానుఁగ్=ఏల రాక నిలుచును, ఏమి=ఆశ్చర్యము! వింతలుగానున్నవి=ఆశ్చర్యముగానున్నవి,ఏమి సేతుఁగ్=ఏమిచేయుదును; (తక్కిన రెండుచరణములకును మొదటిపద్యమునందే యర్థముచెప్పఁబడెను. గనుక యిది మొదలు వదలఁబడును).

తా. ఓచెలీ! నాప్రియుఁడు వనవిహారమునకై పోవఁగా అచటిఋషులు సేవించుటకై నిలిపికొనిరో? లేక, యడవులయందు వేఁటాడుచున్నాఁడో? లేక, రాక్షసులను వధింపఁదలఁచినాఁడో? అట్లుగాక యేస్త్రీయొక్కగాని మాయకులోఁబడెనో; కాక ఎవతెకైనను వాగ్దానము చేసెనో? అదియును గాకున్న నన్ను అలయింపవలెనని దలఁచినాఁడా; ఎవతెమీఁది మమతచేతగాని నన్ను మఱచినాఁడా? లేకున్న నిన్నటిరేయి నాయింటికేల రాకమానును? ఇదేమి? వింతలుగాఁగదా ఉన్నవి! ఏమిచేయుదును?

సీ॥ ఈమోహనాంగుని \ నెలమితోఁ జూచిన
నింతులు వలచి మోహింతు రురదె
కమలాక్షుఁ గనుఁగొని \ కడుపతివ్రతయైనఁ
గోరి, యంగజుకేళిఁ \ గూడు టరుదె

పురుషులౌ మౌనులా పురుషుఁ గాంక్షింపంగ
మగువలు వీక్షించి మరగుటరుదె
శ్రీధరుఁ గాంచి చేరినమానవతియైనఁ
జేపట్టియక్కునఁ జేర్చుటరుదె
గీ॥ యుంటి నాజీవితేశ్వరు వెంటఁ జనక
యింతమతిహీననై యుంటి నేమి సేతు॥ చెలియ॥ 3

టీ. ఈమోహనాంగునిన్ =ఈ (ఇతరులును) మోహింపఁజేయు దేహమును గలవానిని, చూచినన్ =చూడఁగా, ఇంతులు=స్త్రీలు, వలచి=కోరి, మోహించుట=వలపుఁ గొనుట, అరుదె=ఆశ్చర్యమా? కమల+అక్షున్ =తామర ఱేకుల వంటికండ్లు గలకృష్ణుని, కడుపతివ్రతయైనన్ =మిగుల సతీమణిగా ఉండినప్పటికిని, కనుఁగొని=చూచి, కోరి=వలచి, అంగజుకేళిన్ =మన్మథుని క్రీడలయందు, కూడుట=చేరుట, అరుదె=అబ్బురమా? పురుషులౌమౌనులు=మగవారలైన ఋషులే, ఆపురుషుఁ గాంక్షింపఁగన్ =ఆపురుషోత్తముని కోరుచుండఁగా, మగువలు=స్త్రీలు, వీక్షించి=చూచి, మరగుట=మరులుగొనుట, అరుదె= చిత్రమా? శ్రీధరున్ =కృష్ణుని, కాంచి=చూచి, చేరినన్ =చేరఁగా, మానవతియైనన్ =సిగ్గుగలదిగా నున్నప్పటికిని, చేపట్టి=చేరఁదీసి, అక్కునన్ చేర్చుట= ఱొమ్మునచేర్చికొనుట, అరుదె=ఆశ్చర్యమా? నాజీవితేశ్వరు వెంటన్ =నాపతిని వెంబడించి, చనక ఉంటిన్ =పోవక ఉంటిని, ఇంతమతిహీనను ఐ ఉంటిన్ = ఇంత తెలివి మాలి యుంటిని; ఏమిచేతున్ =ఏమిచేయుదును?

తా. ఈమోహనశరీరునిఁ జూచి ఏ స్త్రీలును మోహింప కుందురా? పతివ్రతలుకూడ ఈతనితోడిరతిని కోరుదురు. పురుషులైన మునులే యతని మోహించిన యప్పుడు, స్త్రీలన నెంత? అతనిని ఏమానవతియైనను చూచినంతనే సిగ్గును వదలి, కౌఁగిలింపఁగోరును. అయ్యో! అట్టినా పెనిమిటిని వెన్నంటిపోక బుద్ధిహీనఁగా ఉంటిని ఏమిచేయుదును?

సీ॥ గడెగడె కిది యేమి కారణంబొ కాని
  కనుచన్నులదరునే ఘననితంబ
ముంజేతికంకణంబును సందెకడెముగాఁ
  *బెట్టఁగల్గెను జూడు భీరుమధ్య
యొకరితో మాట్లాడ నూహించి యనఁబోఁగ
  నంతలోఁ దోఁచదే యబ్జనయన
కల్ల గాదిది; వింత గా! యెదలోజల్లు
  జలుమనుచున్నదే చంద్రవదన
గీ॥ యెన్నఁడిటువంటియాశ్చర్య మెఱుఁగనమ్మ
  యెట్టిహేతువొ ప్రాణేశుఁ డేగుటకును॥ చెలియ॥ 4

టీ. ఘననితంబ=(పెద్దపిఱుఁదులుగల) ఓచెలీ, గడెగడెకున్=క్షణక్షణంబునకును, ఇది యేమికారణంబో కాని=ఇదేమిహేతువో కాని, కనుచన్నులదరునే=కండ్లును చండ్లును అదురుచున్నవి, భీరుమధ్య=భయశీలమయిన నడుముగలదానా; ముంజేతికంకణంబును=మనికట్టున వేసికొనఁదగిన కడియమును, సందెకడెముగాన్=భుజములకు వేయుకడియముగా, పెట్టఁగల్గెనుచూడు=ఉంచుకొవచ్చెను చూడు, అబ్జనయన=ఓ తామరసములవంటికండ్లను గలచెలీ! ఒకరితో మాట్లాడన్=ఒకరితో మాట్లాడవలయునని, ఊహించి=తలఁచి, అనఁబోఁగన్=మాట్లాడఁబోవుసమయమునందు, అంతలోఁదోఁచదు = ఆస్వల్పకాలములోనే మఱచిపోవును. చంద్రవదన=చంద్రునివంటి ముఖముగలదానా! కల్లగాదు=అబద్ధముగాదు, ఇది వింతగా = ఇది యొక ఆశ్చర్యముగా ? ఎదలోజల్లుజలుమనుచున్నదే=మనస్సు జల్లుజల్లుమని బెదరుచున్నది, ఎన్నఁడు ఇటువంటి యాశ్చర్యమున్=ఎన్నఁడును ఇట్టివింతను; ఎఱుఁగనమ్మ = తెలిసికొన్నదానను గాను, ప్రాణేశుఁడు ఏగుటకును=నా పెనిమిటి వెడలిపోవుటకు, ఎట్టిహేతువో=ఏమి కారణమో?

---

* "జేర్పఁగల్గెనుచూడు-సిష్మామధ్య" అని పాఠాన్తరము.

తా. గడియగడియకును ఏదోవిశేషమును దెలుపునట్లు ఆంగికసూచనము లయిన కనుచన్నుల అదురుపాటులు గలుగుచున్నవి. కృష్ణవిరహాతిశయము వలనివ్యథచేత దేహము కృశించినందున ముందుచేతికడియములు సందెకడియము లైనవి. అతనిమీఁదితలంపు మఱల్పరామిని ఎవరితో నేమి యాడుటకుఁ బోయినను అంశము దోఁచదు. గుండెలలో జల్లుజల్లుమను అదురుపాటొకటి సంభవించెను. ఎన్నఁడును ఇట్టిచిత్రములను గన్నదానను గాను. నాథుఁడు నన్నెడఁబాసి పోవుటకు కారణమిట్టిదని తెలియకున్నది.

సీ॥ వింటివే యిటువంటి । విపరీతవార్తలు !
    నావిభు నేలాగు । నమ్మవచ్చు
నలదానియురుదొడ । ల్దలగడదిండ్లాయె
    భామగుబ్బలు పూల । పాన్పు లాయె
సుదతివాతెర తియ్య । జుంటి తేనియ లాయె
    వెలఁదిచేతివిడెంబు । విందు లాయె
వనితపయ్యెదవల్లె । వాటు దుప్పటమాయె
    పణఁతిమాటలె యాట । పాటలాయె

గీ॥ ననుచు సతిచూచి చెప్పెనే । యమ్మచెల్ల
    యిట్లు సేయుట కలనైన । నెఱుఁగనైతి॥ చెలియ॥ 5

టీ. (ఓచెలీ) ఇటువంటి విపరీతవార్తలు=ఇట్టివ్యత్యస్తమయిన పలుకులను; వింటివే=విన్నావా; నావిభున్ = నా పెనిమిటిని; ఏలాగ నమ్మవచ్చున్ =ఎట్లు విశ్వసింపవచ్చును? అలదాని ఉరుతొడల్ =దాని పెద్దతొడలు, తలఁగడగిండ్లు ఆయెన్ =(పవళించుచో) తలకు ఆనికలాయెను. భామగుబ్బలు=ఆస్త్రీకుచములు, పూలపాన్పులాయెన్ =పువ్వులతోఁ జేయఁబడిన పడక ఆయెను. సుదతి వాతెర=ఆమంచిపండ్లవరుస గల చెలియయొక్క అధరము, తియ్యజుంటి తేనియలు= తీఁపైన జున్ను తేనెలు, ఆయెన్ =అయ్యెను, వెలఁదిచేతి విడెంబు = ఆకాంత యిచ్చు తాంబూలమే; విందులాయెన్ = వేడుకతిండ్లాయెను, వనితపయ్యెద=

ఆస్త్రీ పైఁటకొంగు, పల్లెవాటు దుప్పటముఆయెన్=పైయంగవస్త్రముఅయ్యెను, పణఁతిమాటలె=ఆస్త్రీనిగుఱించిన సంభావణములే, ఆటపాటలాయెన్=వినోదార్హములయినమాటలును పాటలును ఆయెను, అనుచున్=అని, సతి=(నా) చెలికత్తె, చూచి చెప్పె నే=చూచివచ్చిచెప్పెను, అమ్మచెల్ల=ఆశ్చర్యము, ఇట్లు సేయుట=ఇట్లు నాయెడల నడుచుకొనుట, కలనైనన్ ఎఱుఁగనైతి=స్వప్నమునందైనను గ్రహింపకపోతిని.

తా. అమ్మా ఆశ్చర్యము! వింటివా? నాప్రియునిగుఱించిన విపరీతసంగతులను. అతనికి దానితొడలే తలగడదిండ్లాయెనఁట; దానివక్షోరుహములే శయ్యాలాయెనఁట; దానియధరామృతపానమే జుంటితేనెల నాస్వాదించుటలవలె ఆయెనఁట; దానిచేతి తాంబూలమే విందులాయెనఁట; దానిపైఁటకొంగు పల్లెవాటుదుప్పటముగా నొప్పియున్నదఁట; దానిప్రస్తావనలేయాటపాటలఁట. ఇట్లని నాచెలికత్తె వచ్చి చెప్పినది. ఇట్లు అతఁడుచేయును అని కలలోనకూడ తలఁచిన దానను గాను.

సీ॥ ప్రాణేశుఁ డిపు డెడఁ ◊ బాసియుండుటఁ జేసి
కోవెలల్ తరులెక్కి ◊ కూయఁదొణఁగె;
నలదానిమరులున ◊ నతఁడిందు రాఁడని
యళుల ఝుంకారంబు ◊ లతిశయించె;
నసురారి నాడెన ◊ నలిఁగిపోవఁగ, శశి
వేఁడివెన్నెలఁగాసి ◊ విఱ్ఱవీఁగె;
'నచట బాసల నిచ్చె' ◊ నని సూనశరముల
మర్మమంటఁగ నేసె ◊ మన్మథుండు.
గీ॥ తెలిసి యుండఁబు పగలుసాధించుచుండ;
నింక నేఁదాళఁ గలనఁటే ◊ యిందువదన! ॥ చెలియ ॥ 6

టీ. ఇందువదన=ఓ చంద్రముఖీ! ప్రాణేశుఁడు=విభుఁడు, ఇప్పుడు ఎడఁ బాసి యుండుటఁజేసి=ఇప్పుడు తొలఁగి యుండుటవలన, కోవెలల్=కోకిల

ములు, తరులు ఎక్కి=చెట్లను ఎక్కి; కూయఁదొణఁగెన్=రొదలు పెట్టుటకు ఆరంభించెను, అలదానిమరులునన్=దానిమీఁది మోహముచేత, అతఁడు ఇందు రాఁడు అని=విభుఁడిచ్చటికి రాఁజాలఁడు అని దెలిసి, అళులఝుంకారంబులు=తుమ్మెదల ఝుం అనుకూఁతలు, అతిశయించెన్=అధికములాయెను, అసురారి=రాక్షసులకు పగవాఁడయిన శ్రీకృష్ణుఁడు, అలిఁగి పోవఁగన్=కోపగించికొని పోఁగా, శశి=చంద్రుఁడు, వేఁడివెన్నెలన్ కాసి=ఉష్ణముతోఁడి వెన్నెలను గాసి, విఱ్ఱవీఁగెన్=గర్వించెను, అచటబాసలన్ ఇచ్చెన్=అచ్చట నమ్మకములను ఇచ్చివేసెను, అని=అని దెలిసికొని, మన్మథుండు=మన్మథుఁడు, సూనశరములన్=పుష్ప బాణములచేత, మర్మమంటఁగన్ ఏసెన్=మర్మస్థలము గాఁడునట్లు వైచెను, తెలిసి=గ్రహించి, ఇందఱు=కోకిలాదులయిన యిందఱును, పగలు సాధించుచుండన్=తమ విరోధములను కొనసాగించుచుండఁగా, ఇంకన్ నేను తాళఁగలనఁటే=ఇంక నేనెట్లు ఓర్చికొనియుండఁగలనే.

తా. ఇందువదనా! వినుము నావిభుఁడు నన్ను ఎడఁబాసియుండిన వైమును మన్మథ పరివారములైన కోకిలములు భృంగములు చంద్రుఁడు ఇట్టివారు దెలిసికొని తమ విరోధములు తీఱ చెట్లనెక్కి కూయుట, ఎచటఁ బట్టినను దిఱుఁగులాడుచు ఝుంకారములు సేయుట, వేఁడివెన్నెలలఁ గాయుటగా, పగలు సాధించుచున్నారు. మన్మథుఁడును మర్మభేదన చణములైన ప్రసూనాస్త్రములను వేయుచున్నాఁడు. ఇందఱునుఇన్ని విధముల నన్ను హింసించుచుండఁగా అబల నైననే నేమి చేయుదును?

సీ॥ రమ్మనే, మనవి చేకొమ్మనే, కరుణారా
నిమ్మనే నమ్మిన కొమ్మననవె
యింపుగా నను గాఁగిలింపుచుఁ బ్రౌఢి ర
చింపుచు రతులఁ గ్రీడింపు మనవె
బాలనే విభుఁ బాయఁ జాలనే యీచలం
బేలనే, నీకైన గోలననవె

వెచ్చఁగా మైకాఁక ఽ లెచ్చఁగా విరితూఁపు
లిచ్చఁగా మరుఁ డెదఁ ఽ గ్రుచ్చె ననవె

గీ॥ నీరు నన్నంబు నిద్రయు ఽ నిగ్రహించి
వేఁగుచున్నట్లు మనవిగా ఽ విన్నవించి ॥ చెలియ॥ 7

టీ. (చెలియా ! విభుని) రమ్మనే=రమ్మని చెప్పుమా! మనవి చేకొమ్మనే=నావిన్నపమును గ్రహింపుమనుమీ, కరుణరానిమ్ము అనే=దయచూపుమను, నమ్మిన కొమ్మను అనవె=తన్ను నమ్మిన బాలను అని చెప్పుము. ఇంపుగాన్=ఇష్టముగా, నను కౌఁగిలింపుచున్=నన్ను ఆలింగనము చేసికొనుచు, ప్రౌఢి రచింపుచున్=తన నేర్పరితనమును వెలయించుచు, రతులఁ గ్రీడింపుము అనవె=రతికేళిని తేలుము అనవె, బాల నే=నేను పడుచుదానను, విభున్ పాయఁజాలను=పతిని వదలి (ఒంటిగా) ఉండలేను. ఈచలంబేల నే=ఈ కోపమేల ? "నీకైనగోల" యనవె=నీమనస్సుకెక్కిన పడుచు అని (అతనితో) చెప్పుము, వెచ్చగాన్=వేఁడిగాను, మైకాఁకలు ఎచ్చఁగాన్=విరహాగ్ని తాపములు ఎచ్చునట్లుగా, మరుఁడు=మన్మథుఁడు, ఇచ్చగాన్=కోరి, ఎదన్ గ్రుచ్చెను అనవె=ఱొమ్మున బాణము వేసి బాధించెనని చెప్పుము, నీరును అన్నంబు నిద్రయున్=పానమును అన్నమును నిద్రను, నిగ్రహించి=విరోధించి, వేఁగుచున్నట్లు=తపించుచున్నట్లు, మనవిగాన్ విన్నవించి=నావిన్నపముగా మనవి చేసి (కలువాయి చిన్నికృష్ణునిబిలుచుకొనిరమ్ము).

తా. ఓ చెలీ; అతనిని వచ్చి నామనవి యంగీకరించునట్లు చెప్పుము. నాయందు దయ పెట్టుమనుము. తన్ను నమ్మిన బాలయని చెప్పుము. ప్రీతితో నన్నుఁ గౌఁగిలిని తేల్చమనుము, నేర్పరితనము మీఱ రతికేళి సల్పుమనుము. నేను బాలననియును పెనిమిటిని బాసియుండఁ జాలననియును చెప్పుము. ఈ కోపమేల? నీకైనపడుచు గదా యది, అని విన్నవింపుము. మన్మథాగ్నికి తాళఁజాలక అన్నపానములను నిద్రను పరిత్యజించి వేఁగుచున్నదని నామనవిగా విన్నవించి నాథుని వెంటఁ బెట్టుకొని రమ్ము.

సీ॥ ఆకుమడ్పులు మోవి కందియియ్యకగాని
విడెముసేయఁడు గదా వెలఁదులార!
యెనసి యిద్దరముఁ బోత్తున భుజింతుముగాని
వేరు భుజింపఁడే వెలఁదులార!
పొంకమ్ముగా నేను బూయక, పరిమళ
గంధంబు నలఁదఁడే కాంతలార!
పడకింటిజవ్వాదిబరిణఁ దేఁబోయిన
వడిగ వెంబడివచ్చు వనితలార!

గీ॥ గడియ యెడఁబాయఁ జాలఁడే కారణంబొ
రాకయున్నాఁడు నన్నింత యట్టు సేసి॥ చెలియ॥ 8

టీ. వెలఁదులార! నోటికిన్ =నోటివఱకును, ఆకుమడ్పులు, అంది ఇయ్యక గాని=అందియియ్యకుండిన, విడెముసేయఁడుకదా=తాంబూలము గ్రహింపఁడు; వెలఁదులార! ఇద్దరమున్ ఎనసి=ఇద్దఱముగాఁజేరి, పొత్తునన్ భుజింతుము గాని=జోడుగా ఆహారము కొందుముగాని, వేరు భుజింపఁడు=ఒంటరిగా తిని యెఱుఁగడు. కాంతలార! పొంకమ్ముగాన్ =పొందికగా, నేను పూయక=నేను అలఁదకయే, పరిమళ గంధంబును, అలఁదఁడే=వాసనగంధమును బూసికొనఁడు, వనితలార! పడకింటి జవ్వాది బరిణన్ = పడకటింటనున్న జవ్వాదిడబ్బిని, తేఁబోయినన్ =తెచ్చుటకయి నేను పోఁగా, వెంబడి వచ్చునే=నావెంట నేవచ్చును, గడియ యెడఁబాయఁజాలఁడు=ఒకక్షణము తొలఁగియుండఁడు, ఏకారణంబొ=ఏమికారణమో, నన్నింతయట్టుఁజేసి=నన్నింత యాఱడిపఱచి, రాకయున్నాఁడు=ఇందు రాకున్నాఁడు.

తా. చెలికత్తెలార! నేను ఆకు మడుపులమడిచి యతనినోటి కందియియ్యకయే తాంబూలము గ్రహింపఁడు. నాజతలేకయే ఒంటరిగా నన్నము దినఁడు. నేను పొంకముగా గంధమును బూయకయే తాను బూసికొనఁడు. నేను జవ్వా

ది బరిణను తెచ్చుటకయి శయ్యాగృహమునకుఁబోగా నంతసేపటికి నాయెడఁ బాటును ఓర్వక వెంబడించియే వచ్చును. క్షణ మెడఁబాయఁడు ఏమికారణ మో? నన్నిట్లు అట్టుపుచ్చి రాకున్నాఁడు.

సీ॥ నావిభుఁ డీలాగు । పోవుట లెఱిఁగిన
 నెనరుగా బతిమాలి । నిలిపి కొందు;
నిలువక కోపించి । నిక్కి పోఁదలఁచినఁ
 గదిమి పయ్యెద నంటఁ । గట్టికొందుఁ;
గట్టుల వదలించి । కదలిపోఁదలఁచిన
 జంటాడి వదలక । వెంటనుందు;
వెంటరా మఱపించి । వెళ్లఁగాఁ దలఁచిన
 విడఁజాల నని మ్రొక్కి । వేఁడికొందు;

గీ॥ నిట్లు సేయుట గలనైన । నెఱిఁగియున్న
 రమణు నిలువెళ్లనిత్తునా । నిముసమైన॥ చెలియ॥ 9

టీ. నావిభుఁడు, ఈలాగు, పోవుటలు=నన్ను విడనాడిపోవుటలు, ఎఱిఁగి నన్ =తెలిసియుంటినేని, నెనరుగాన్ =కృతజ్ఞత పుట్టునట్లు, బతిమాలి= వేడికొని, నిలిపికొందున్ =నిలుచునట్లు చేయుదును, నిలువక, కోపించి, నిక్కి పోన్ తలఁ చినన్ =గర్వించిపోవుటకు ఎంచెనో?కదిమి=చేర్చి, పయ్యెదనంటన్ కట్టికొం దున్ =పైఁటకొంగుతో అంటకట్టికొనియుందును, కట్టులన్ వదలించి=నాకట్ల నుండి తొలఁగి, కదలిపోఁదలఁచినన్ =జాఱిఁగిపోవుటకు ఎంచెనో, జంటాడి= జోడుకూడి, వెంటఁజనుదున్ =వెంబడించిపోదును. వెంటరాన్ =నేను వెంబడిం చిపోఁగా, మఱపించి=ఏమఱించి, వెళ్లఁగాఁ దలఁచినన్ =పోవుట కెంచెనో ? విడఁజాలను=నిన్ను వదలలేను అని, మ్రొక్కి=నమస్కరించి, వేఁడికొందున్ = ప్రార్థించుకొందును. ఇట్లు సేయుట=ఇవ్విధముగా నన్నుఁ దొలఁగియుండుట, కలనైనన్ ఎఱిఁగియున్నన్ =స్వప్నమునందైనను దెలిసికొని యుంటినేని, ర

మణుని=ప్రియుని, నిమునమైనను, ఇలువెళ్లనిత్తునా=ఇంటినుండి కదలిపో నిచ్చి యుందునా ?

తా. నాప్రియుఁ డిట్లు పోవుటలు దెలిసికొనియుంటినేని, అతని వేడికొని నిలిపికొనియుందును నిలువక కోపించి వెళ్లిపోవఁజూచెనో, పయ్యెదచేత చేర్చి కట్టికొనియుందును. ఆకట్లనుకూడ వదలించికొని పోఁడలఁచెనా, అతనిజోడు వదలక వెంటనేపోదును. అప్పుడును ఏమఱింపఁ దలచెనో, నిన్ను పదలియుండఁజాలను అని మ్రొక్కి ప్రార్థించుకొందును. ఇట్లుచేయుట కలలోన సైతము దెలిసికొన్నదాననుగాను. అట్లుదెలిసియున్న రమణుని ఇంటినుండి వెడలనిచ్చి యుందునా ?

సీ॥ వెలఁదులునాప్రాణ విభుని దాయఁగఁజూచి,
చెంత నేమఱకుందుఁ జిగురుఁబోఁణి !
యచ్యుతుం డెలదోట లందుఁ జరింపఁగా,
నండఁబాయక యుందు నంబుజాక్షి !
వేడుక నాపతి వేఁటాడఁ బోవుచో,
జంటగాఁబోదునో చంద్రవదన !
శ్రీహరి నిద్రింపఁ జేరి యాశయ్యపైఁ
గదిసి నేఁ బవళింతుఁ గంబుకంఠి !
గీ॥ యిన్నివిధములుగాఁ గాఁచి యున్న విభుని
ముదిత మాయలలోఁగొనె మోసపోతి ॥ చెలియ ॥ 10

టీ. చిగురుఁబోఁణి=చిగురాకువలె మృదువైన శరీరముగల ఓచెలీ? వెలఁదులు=స్త్రీలు, నా ప్రాణవిభుని=నాజీవితేశుని, డాయఁగన్=దగ్గఱింపఁగా, చూచి, చెంతన్=దగ్గఱనే, ఏమఱక ఉందున్=జాగ్రత్తతో నేయుందును. అంబుజాక్షి=ఓతామరసలోచనా ? అచ్యుతుండు=శ్రీకృష్ణుఁడు, ఎలదోటలందుఁ జరింపగాన్=ఉద్యానవనములయందు విహరింపఁగా, అండఁబాయక యుందున్=సమీపమును వదలకుందును. చంద్రవదన=చంద్రునివంటి మోమునుగలచెలీ ! నా

పతి=నా పెనిమిటి, వేఁడుకన్=వినోదముగా, వేఁటాడన్ పోవుచోన్=వేఁట లాడుటకై పోవఁగా, జంటగాఁ బోదును=జతకూడి వెళ్లుదును. కంబుకంఠి= చెలీ! శ్రీహరి నిద్రింపన్=శ్రీకృష్ణుఁడు నిద్రింపఁగా, ఆశయ్యపైఁ జేరి=ఆ పడకను చేరి, కదిసి = దగ్గరించి, నేఁబవళింతున్ = నేను పరుండియుందును. ఇన్నివిధములుగాఁ గాఁచియున్నన్ = ఇన్నిరీతులుగా కనిపెట్టుకొనియుండినను, ముదిత=ఆ స్త్రీ, విభునిన్=పెనిమిటిని, మాయలన్= మాయలచేత, లోఁగొనెన్=వశపఱచుకొనెను, మోసపోతిన్=మోసముచెందితిని.

తా. స్త్రీలు నావిభునిదగ్గఱుంచుటలను కంటినా దగ్గఱనే యేమఱకుందును. అతఁడుద్యానముల చరించువేళలను, వేఁటలాఁడబోవు కాలములను జంటగా పోవుదును అతఁడు నిద్రించువేళలందును తదీయశయ్యను జేరియేయుందును ఇన్నివిధములుగాఁ గనిపెట్టికొని యుండినను ఆకాంత యతని తనకు వశ్యునిఁ జేసికొనెను; మోసపోతిని.

సీ॥ అతఁడేమియూడిగ ఽ మానతిచ్చిన దాని,
నడుగుదాఁటక ఽ చేతు నంబుజాక్షి!
గీతప్రబంధ సంఽగీతముల్ గోరిన,
నింపుగాఁ బాడుదు ఽ నిందువదన!
యేరీతిబంధంబు ఽ లెనయుదమన్నను,
మనసురా నలయింతు ఽ మందయాన!
యేనాట్యముల నాడ ఽ నిచ్చలోఁ దలఁచిన,
పొలుపుగా నాడుదుఁ ఽ బువ్వుఁబోణి!
గీ॥ ప్రాణనాథుని కెదురు నేఁ ఽ బలికి యెఱుఁగ,
నలుగఁగారణమేమని ఽ యడుగుమమ్మ॥ చెలియ॥ 11

టీ. అంబుజాక్షి=ఓతామరసనేత్రా! అతఁడు=విభుఁడు, ఏమియూడిగమున్ = ఏపనిని, ఆనతిచ్చినన్ గాని= సెలవిచ్చినప్పటికిని, అడుగుదాఁటక చేతున్=జవదాఁటక చేయుదును. ఇందువదన=చంద్రముఖీ! గీత=గీతములు పాడుటలను,

ప్రబంధ=కావ్యములుచదువుటలను, సంగీతముల్ =సంగీతమును, కోరినన్ =వినఁగోరఁగా, ఇంపుగాపాడుదున్ = రామణీయ్యకముగా పాడుదును. బంధంబులు= ఉరగాది రతిబంధంబులను, ఏరీతిఎనయుండము అన్నను=ఏవిధముగా పెనఁగుదము అని చెప్పినను, మందయానా=ఓయలసగమనా! మనసురాన్ అలయింతున్ = అతనియిచ్ఛకు వచ్చునట్లుగా నల మటవెట్టుదును, ఏనాట్యములన్ = ఎట్టిన ర్తనములను, ఆడన్ =న ర్తింపవలెనని, ఇచ్ఛలోఁ దలఁచినన్ =ఇష్టపడిన, పువ్వుఁబోణి=కుసుమకోమలీ! పొలుపుగాన్ ఆడుదున్ =మనోజ్ఞముగా న ర్తనమునలుపుదును. ప్రాణనాథునికిన్ =జీవితేశునికి, నేను ఎదురుపలికి యెఱుఁగన్ = నేను అడ్డముమాటలాడి యెఱుఁగను. అలుఁగన్ =కోపగించుకొనుటకు కారణము, ఏమి అని=ఏమిహేతువని, అడుగుమమ్మ=అతనిని అడుగుము.

తా. ఓచిగురుఁబోణీ! వినుము. నాజీవితేశుండు నాకేపనిపెట్టినను అడ్డుపలుకకచేయుదును, గీతప్రబంధాదులనుపఠింపుమన్న అట్లేపఠింతును. కోరినబంధముల పెనఁగుదును. కోరిననాట్యముల కోరినట్లు లాడుదును. ఇట్లు విభునికడ్డము చెప్పకచేయు నామీఁదకోపగింపకారణం బేమనియడుగుమా?

సీ॥ - దానివగలపెక్కు ౹ తక్కులచిక్కుల
మాయలకతఁడు లో౹నాయెనమ్మ
దానివాకౌఁగిలిం౹తలనాటపాటల
జిలిబిలిసుద్దులఁ ౹ జిక్కెనమ్మ
దానికెమ్మోవుల ౹ దలరాపుమందుల
మమతలఁబడి యిందు ౹ మఱచెనమ్మ
దాని జగ్గులతీవిఁ ౹ దఱుచైన మైతావి
బలునోయారములకు ౹ భ్రమసెనమ్మ
గీ॥ యిట్టిపెనుజంతయగుదాని ౹ యిల్లుఁజేరెఁ;
దలఁపులోనఁగూర్పనాకైన ౹ దానవీపు॥ చెలియ॥ 12

టీ దానివగల = దానిహావములయొక్క, పెక్కుతక్కులచిక్కులన్ =

అనేకములయిన టక్కులవలని చిక్కులతోఁగూడిన, మాయలకున్ = మోసములకు, అతఁడులోనాయెనమ్మ=అతఁడులోఁబడిపోయెనమ్మ, దానివాకాఁగిలింతలన్ =దానిఆలింగనములయందును, ఆటపాటలన్ = క్రీడాగానములయందును, జిలిబిలిసుద్దులన్ =చిన్నారిముచ్చటలయందును, చిక్కెనమ్మ=తగులుకొనెనమ్మ, దానికెమ్మోవులన్ =దాని యధరామృతపానములందును, తలరాపుమందులన్ = తలకురాయునట్టి వశీకరణౌషధములకును, మమతలన్ పడి=మోహమునజిక్కి, ఇందుమఱచెనమ్మ=నన్ను విస్మరించెఁగదమ్మ, దానిజగ్గులతీవి= దానికాంతులతో డిరీవికిని, తఱుచైన మైతావి=దట్టమైన శరీరసౌరభములకును, బలునొయ్యారములకున్ =వివిధములైన శృంగారచేష్టలకును, భ్రమసెనమ్మ = భ్రమసినాఁడమ్మ, ఇట్టి పెనుజంత=ఇట్టిమిగుల నేర్పరి, అగు దానియిల్లున్ = అగు నా స్త్రీయొక్క యింటికిని, చేరెన్ =చేరెను, తలఁపులోనఁగూర్పన్ = నాయిచ్ఛలను కొనసాగించుటకు, ఈవు=నీవు, నాకైనదానవు=నాకు ప్రియురాలవు.

తా. ఆ స్త్రీ చేయునట్టి హావభావాదివిలాసములకును దాని వశీకరణౌషధ ప్రయోగంబులకును జిక్కి, విభుఁడు దానికే దక్కిపోయెను. నాతలంపులోనఁ గూర్పఁదగినదానవు నీవు గనుక అతని తోడికొని వేగరమ్ము.

సీ॥ ఏలనేరాఁడువాఁ డేలనేయేఁచేది
మానెనో నాప్రేమ మందయాన!
వీఁడఁటేహరి!చన వీఁడఁటే యీరేయి
నొంటినెట్లోర్తు? నయ్యో!మృగాక్షి
వేఱుగాఁజూడ; నవ్వేరుగా, కనఁడాయెఁ
గపటమైత్రిగదమ్మ కంబుకంఠి!
మందు చేవలచె; నే మందుఁ జేసేత నే
మోముచూపులు పాసె మోహనాంగి!
గీ॥ వగలపక్కులు, జిగిబిగి, వలపు, నగవుఁ,
దక్కు లొలయించుదానిచేఁ జిక్కినాఁడు॥ చెలియ॥ 13

టీ. మందయాన=ఓమందగమనా; వాఁడు=విభుఁడు, ఏల నేరాఁడు=ఎందుకు రాఁడు; ఏఁచేది ఏల నే=ఏల నే మోసగించుట, నాప్రేమమా నెనో=నాయెడల ప్రీతినివీడెనో? అయ్యోమృగాక్షి=అక్కటా! హరిణాక్షీ! వీఁడ టేపారి=హరియగు ఇతఁడో! చనవు ఈఁడ టే=సాగుడలను ఇయ్యఁడో? ఈరేయి=ఈరాత్రి ఒంటికే=ఏకాకితనమును, ఎట్లు ఓర్తు నే=ఎట్లు భరింపఁగల నే, కంబుకంఠి=శంఖముపోలిన కంఠముగలదానా! వేఱుగాఁజూడకే = నన్నితర స్త్రీనిగా భావించిన, నవ్వేరుగా=జనులుపరిహాసింతురుగదా! కనఁడాయెకే=(దీనిని)ఆలోచింపఁడు, కపటమైత్రి గదమ్మ=కపటమైనస్నేహముగదమ్మ, మోహనాంగి=మోహనమైన శరీరముగలఓచెలీ! మందుచేవలచేకే = దానివశీకరణౌషధప్రయోగంబులకు మోహించెను. ఏమందుకే=ఏమిచెప్పుదును? చేసేత నే=తోడనే, మోముచూపులుపాసెకే = ముఖావలోకనములు తప్పిపోయెను. వగలు=విలాసములు, దక్కులు=లోఁబడుటలు, జిగిబిగివలపునగవు=కాంతియును గర్వమునుంగలిగి మోహమునుగలిగించునవ్వు, టక్కులు=జిత్తులు, బలియించుదానిచేకే=కలిగించునట్టిదానికి, చిక్కినాఁడు=తగిలినాఁడు.

తా. ఓమందయానా? విభుఁడు ఏలరాఁడు? ఏలనన్ను మోసగించుట? ఇంకచనువు నే యియ్యఁడో? అయ్యో! యీరేయి నేనెట్టులొంటిగా నుండజాలుదును. నన్నితఁడు అన్యగాఁ జూచిన, అన్యులు నవ్వరా? దానిమందులమాయలకుగా విభుఁడులోఁబడిపోయెను? తోడనే మోముచూపులు కూడగదా వదలెను. దాని విలాసములకే దప్పక దక్కిపోయినాఁడు.

సీ॥ కోయిల!యూఱక ॥ కూసెదు; క్రొవ్వటే
వట్టి కెంజిగురునీ ॥ వాఁతఁబడను!
జంత మయూరమా! ॥ యింతగర్వంబటే
విచ్చిమైపొఱలెత్తి ॥ విచ్చఁబోఱ!
జడియక కాసేవు ॥ జాబిల్లి! నీరూపు
పదియాఱు తునియలై ॥ పఱదఁగలియ!

మదన!నాయెద నాటc ♦ మఱితూపు లేయుదు,
చెదరి నీయస్త్రముల్ ♦ చెట్లcగలియ!
గీ॥ ననుచు నే నెన్నిదిట్టిన ♦ నాన లేక,
యతcడురాc డయ్యోననియంద ♦ అజ్జc గనిరి॥ చెలియ॥ 14

టీ. కోయిల=ఓకోకిలమా! ఊటలకకూసేవు = ఊటలకపదరెదవు; వట్టికెంజిగురు=లేcతచిగురుటాకుమాత్రము, నీవాతcబడను=నీనోటcబడును గాక! ఇచ్చట మన్మధునివలని తహతహలధికములగునట్లు మదనోద్దీపకములగు కూcతలుకూయుటచే నీకు చిగురుటాకుదప్ప దివ్యఫలాదులు నీనోటికందక పోవలెను గాక! యని కోకిలమునుజూచి శపించుచున్నది. కోకిలకు స్వాభావికాహారమగు కెంజిగురుటాకులకు ఇట్టి కల్పనము పొసఘటించుటం బట్టి కవితాచమత్కృతిస్ఫురించును. ఇట్లే తక్కిన వాక్యములకును అని గ్రహించునది. జంతమయూరమా=దిట్టతనముగలనెమలీ! ఇంతగర్వంబటే=నీ కింతగర్వమా? విఱిసి=(చీలి) విచ్చి, పైపొరలుఎత్తి=(దేహముమీcది తోలుపొరలుగాఏర్పడి) ఱెక్కలుపొరలెత్తి, విచ్చcబొఱ=(విచ్చిపోనుగాక) విఱివిచెందును గాక, నెమళ్లుపురులనువిప్పి నర్తనముసలుపుట స్వాభావికమేయని తెలియునది. జాబిల్లి=చంద్రుcడా! జడియకకాసేవు=భయమేలేక వెన్నెలలను వెదచల్లెదవు. నీసాపు=నీబింబము, పదియాఱుతునియలై=పదునాఱు ఖండంబులయి, వఱదc గలియ=ప్రవాహమునందుపడును గాక! ఇట చంద్రమండలమునకు శుక్లపక్షమునుండి కృష్ణపక్షమునకు గ్రమంబుగాcగళలుక్షీణించుట స్వాభావికమని దెలియునది. మదన=ఓమన్మథుcడా! నాయెదనాటc=నాహృదయము గాcడునట్లుగా, మఱితూcపులు ఏసేవు=మిన్నక బాణముల నేసెదవు, చెదరి=చెల్లాచెదరయి, నీయస్త్రముల్=నీబాణములు, చెట్లcగలియ=చెట్లనుచేరును గాక. ఇక్కడ మన్మథబాణములు చెట్లcగలియునట్లుశపింపcబడె. ఇది చెట్లనుండివీడిన పూవులు మఱల చెట్లనంటికొనుట స్వాభావిక విరుద్ధము-కాcబట్టి, యీవాక్యము తొల్లింటి మూcడువాక్యముల వలె నర్థగాంభీర్యమును స్వభావశుద్ధిని, వహించినదిగాదు. గనుక యీపాఠము కంటె "చెదరి నీగుణమది• చెట్లcగలియ" అన్న బాగు. ఇచట మన్మథుని ధనువు

నందలి గుణముగా నేర్పడినది (భ్రమరములు,అవి చెదరిచెట్లను గలియుట స్వాభావిక మే.)అనుచున్ =ఇట్లుచెప్పుచు, నేనువెన్నితిట్టినన్ = నేనెన్ని విధములదూషించినను, ఆసలేక=నాయందాశలేక, అతఁడురాఁడయ్యెన్ =అతఁడురాఁడు, అని, అందఱున్ =కోకిలాదులు, అర్జన్ కనిరి=గర్వమొందిరి.

తా. ఓకోకిలమా! యేలకూసెదవు? నీవాతఁజిగురుటాకులుపడునుగాక! ఓ మయూరమా? నీగర్వ్రేదక మేమి? నీయొడలు పురులుపీఁడునుగాక! చంద్రా! భయములేక వెన్నెలగా సేవుగా? నీ బింబము పదునాలుఖండములైపఱదపడును గాక? మన్మథా!ఏలయిట్లు నన్నే సెదవు? నీ యల్లెత్రాడు చెట్లఁగలియునుగాక?

సీ॥ ఉత్సాహకరణమౌ నుద్యానవనము ద
ర్పక కాననమురీతి భయదమయ్యె;
దర్పణఖచితమై తనరు చిత్రపుటిండ్లు
తెరలి చూడఁగ మది దిగులు దోఁచెఁ;
గడు సుందరంబులౌ కమలాకరంబులు
పంచబాణునిపొది పగిదిఁ దోఁచె;
వీనులకింపులౌ వీణానినాదముల్
కర్ణశూలంబుల కరణిఁ దోఁచె;
గీ॥ నిట్లుదోఁచుట కారణం బేమొ కాని;
దిన దినంబును మదిలోన దిగులువ్రేడము॥ చెలియ॥ 15

టీ. ఉత్సాహకరణము ఔ ఉద్యానవనము=సంతోషమునుజేయు ఉపవనము,దర్పక కాననము రీతిన్ =మన్మథాటవివలె, భయదము అయ్యెన్ =భయమునిచ్చునది అయ్యెను, దర్పణ ఖచితమై=అద్దములచేత వెలయింపఁబడిన,చిత్రపుటిండ్లు=చిత్రములతోఁ గూడిన క్రీడాగృహంబులు, తెరలిచూడఁగన్ = తేఱిచూడఁగా, మది దిగులుదోఁచెన్ =మనస్సునందు దిగులుపుట్టెను; కడుసుందరంబులౌ కమలాకరంబులు=మిగుల నందములయిన తామరకొలఁకులు,పంచబాణుని పొదిపగిదిన్ =మన్మథుని తూణీరమువలె, తోఁచెన్ =కనఁబడెను,వీనులపండు

వులైన వీణాధ్వనుల్ = కర్ణరసాయనము లయిన వీణానినాదములు. కర్ణశూలంబుల కరణిక్ = చెవులకు ములుకులవలె, తోఁచెక్ = కనఁబడెను, ఇట్లుదోఁచుట = ఇట్లుఅగుట, కారణం బేమొకాని = ఏమి హేతువోగాని, దినదినంబున = అనుదినమును, మదిలోనక్ = మనస్సునందు, దిగులు వొడమక్ = దిగులు దోఁచెడిని.

తా. సంతోష మిచ్చుచుండిన ఉద్యానవనము మన్మథాటవివలె భయంకరమాయెను నిలువు టద్దములుగల చిత్రములతోడి క్రీడాగృహములు తేఱిచూచుటకుఁ గాకున్నవి, మిక్కిలి యందములైన కమలాకరములు మన్మథుని యమ్ములపొదివలెఁ దోఁచెడిని, కర్ణరసాయనములైన వీణాధ్వనులు కర్ణకఠోరము లయియొప్పెడిని. ఇట్లగుటకుఁ గారణంబేమో, సదా మనస్సు దిగులునకాలయమయి పోయినది.

సీ॥ భయము జెందితినని ‡ నయముగాఁ దెల్పేరు,
  కూనగాడ్పుల యెలఁగోలు వచ్చె;
బెదరకుమని యెంతో ‡ బీరము ల్పలికేరు,
  పికముల కైలాట ‡ మిఁకఁ గడంగె;
వెఱవకుమనుచు నం ‡ దఱుఁ జేరి నవ్వేరు,
  చెల్లఁబో! గానరో! ‡ చిలుక పౌజు;
జడియకుమని వెన్నుఁ ‡ జఱచి, సొక్కెనవేరు,
  కదిసెఁ గన్గొనుఁడు తు ‡ మ్మెదల గుంపు;
గీ॥ లిదిగొ! మదనుఁడు శరములు ‡ నెక్కువెట్టె,
  నడఁచె మీకేమి? నావెత ‡ ల్నాకుఁ దెలియు॥ చెలియ॥ 16

టీ. భయము చెందితిని = భయపడితిని, అని, నయముగాక్ = చతురతతో, తెలిపేరు = తెలిపెదరు, కూనగాడ్పుల = లేఁత తెమ్మెరలయొక్క, ఎలగోలు వచ్చెక్ = కలకలమువచ్చెను, బెదరకుము = భయపడకుము, అని, ఎంతో బీరముల్ = ఎంతో వీరాలాపములను, పలికేరు = చెప్పెదరు; పికముల కైలాటము =

కోకిలములమాయోపాయము, ఇఁకఁగడఁగెన్ = ఇంకను ఆరంభించెను, వెఱవకుము అనుచున్ = భయపడకుము అని, అందఱుఁజేరి నవ్వేరు = అందఱును గా చేరి పరిహాసించెదరు, చెల్లబో = అయ్యో! చిలుక పౌజున్ = చిలుకలగుమిని, కానరో = చూడరా? జడియకుము అని = భయమందకుము అని, వెన్నున్ చఱచి = వీఁపును దట్టుచు, సొక్కెను అనేరు = సొక్కిపోయినది అని చెప్పెదరు, తుమ్మెదలగుంపు = భ్రమరముల పిండు, కన్గొనుఁడు కదిసెన్ = చూడుఁడు అదే దగ్గరించెను, ఇదిగో = ఇదో! మదనుఁడు = మన్మథుఁడు, శరములన్ = బాణములను, ఎక్కువెట్టి = సంధించి, అడఁచెన్ = ప్రయోగించెడిని; మీకేమి = మీకేమిగలదు? నావెతల్నాకుఁ దెలియున్ = నాహింసలు నాకే కదా తెలియును.

తా. భయపడితివని నీతులుపలికెదరు చల్లని మెల్లనిగాలికేమి బదులుచెప్పెదరు. అదిగో వచ్చెను! బెదరకుము అని వీరాలాపములు ఆడెదరు కోకిలములకై లాటము లధికములయ్యెను. భయపడకుమని చెప్పి, యందఱును నవ్వుచున్నారు చిలుకల గుంపు లవే వచ్చెను భయపడకుము అని వీఁపుఁజఱచి, సొక్కినది అని చెప్పెదరు; తుమ్మెదలగుంపు అదిగో కదియువచ్చెను, మన్మథుఁడిదే బాణము లేయుచున్నాఁడు. మీకేమి? నాహింసలు నాకేకదా తెలియును.

సీ॥ అతివకు నిట్టూర్పు । లధికమై, పొఱలుచు
భామ నేఁ డేమొకో । పవ్వళించెఁ;
గసి దీఱ మోవి నొక్కకు । మ్రొక్కెద నటంచుఁ
గాంతనిద్దురఁలోనఁ । గలువరించుఁ;
బతి వచ్చె నని వేఁగఁ । బరవశయై లేచి
గ్రక్కున బయలంటఁ । గాఁగిలించు;
హా! యని మేల్కాని । యంత దెసల్ గని
తలవంచు లజ్జించుఁ । దల్లడిల్లు;
గీ॥ నంగజ జ్వరవేదన । యతిశయించె
దడవుసేయంగఁ గూడ ది । త్తఱిని మనము॥ చెలియ॥ 17

టీ. అతివకు నిట్టూర్పులధిక మై=ఇంతికి పెద్దయూఁపిరులు ఎక్కువలయి, పొ అలుచుఁ=(శయ్యపై) పొఱలాడుచు, భామ=ఇంతి; నేఁడు, ఏమొకో=ఏలనో, పవ్వళించెఁ=పరుండెను, కాంత=చేడియ, కసితీఱఁ=నీకోప మాఱునట్లుగా, మోవినొక్కకుము=అధరమును క్షతముచేయకుము; మ్రొక్కెదను అటంచుఁ= నమస్కరించెదను అని, నిద్దురలోనఁ=నిద్రయందు, కలువరించుఁ=కలువరపు మాటలాడును. పతివచ్చెఁ అని=విభుఁ డేతెంచెనని, పరవశయై=ఒడలుదెలి యనిదియై, వేగఁ లేచి=దిగ్గనలేచి, బయలు అంటఁ కౌఁగిలించుఁ=బయలు ను చేర్చి కట్టుకొనును. హాయని=హా!హా! యని, మేల్కని=నిద్రనుండిలేచి, అం తఁ, దెసల్ గని=దిక్కుల నిరీక్షించి, తలవంచుఁ=తలవంచును, లజ్జించుఁ= సిగ్గుఁజెందును, తల్లడిల్లుఁ=తల్లడమును జెందును, అంగజజ్వరవేదన=విరహవేద న; అతిశయించెఁ=అధికమయ్యెను. ఇత్తఱిని=ఇవ్వేళయందు, మనము, తడవు సేయంగఁ తగదు=ఆలస్యపఱచరాదు.

తా. చెలియ నేఁడేమొకో నిట్టూర్పులతో పొర్లాడుచు పవ్వళించెను. నిద్ర యందు "నీకసితీఱ పంటచే మోవినొక్కకు అఁకలువరించెడిని. విభుఁడువచ్చి నాఁడని లేచిబయలును కౌఁగిలించుకొనుచున్నది. హాహారవంబులతో మేల్కని దిక్కులఁ బరికించుచున్నది. తలవంచుచు, సిగ్గుజెందుచు, తల్లడిల్లుచుఁ జెప్ప రాని హింసల ననుభవించెడిని. మదనతాపమే అతిశయించెను. ఇట్టిసమయము నందు మనము ఆలస్యముచేయరాదు.

సీ. పెదవులెండెఁ నటంచుఁ § బేర్మినీరిచ్చేరు
దీనిచే నెండుటల్ § దీఱునఁటరె?
మైకాఁకకును జల్వ § మందులబెట్టేరు
వీనిచేఁ గాఁకలు § దీఱునటరె?
శ్రమబిందు లుడుగంగఁ § జల్లఁగా వీఁచేరు
దీనిచేఁ జెమ్మటల్ § దీఱునటరె?
అచ్చటఁ జెమరించెగా! § అనిమందులిచ్చేరు
గ్రొచ్చుపైమఱిగా —

దీన నామంటలు ◊ దీఱునటరే?

గీ॥ నా శరీరగుణంబు నా ◊ నాథుఁ డెఱుఁగు,
నింక నాలస్య మొనరింప ◊ నెక్కుడగును॥ చెలియ॥ 18

టీ. పెదవులెండె నటంచుర్ = పెదవులు ఎండిపోయెనని, ప్రేమ్మనీరు ఇచ్చేరు = ప్రేమతో నీటిని దెచ్చియిచ్చెదరు. దీనిచే నెండుటల్ తీఱునఁటరే = ఇందువలనఁ బెదవులెండుట తీఱిపోవునో? మైకాఁకకును = దేహతాపంబునకయి, మందులర్ పెట్టేరు = మందులను ఇచ్చెదరు. దీనిచేఁ గాఁకలుదీఱునఁటరే = ఇందువలన శరీరతాపమునకుఁ బరిహారము గలుగునో? శ్రమబిందు లుడుగంగర్ = చెమ్మటలు పోవునట్లు, చల్లఁగావీచేరు = చల్లఁగ గాలి వీచెదరు, దీనిచేర్ = ఇందుచేత, చెమ్మటల్ దీఱునటరే = చెమటలుపోవునో! అక్కడ చెమరించెర్ = అక్కడచెమర్చెను, అని, మందులిచ్చేరు = అని యౌషధంబుల నిచ్చెదరు, దీన నామంటలు దీఱునఁటరే = ఇందుచే శరీరతాపం బడఁగునో? నాశరీరగుణంబుర్ = నా దేహతత్వమును, నానాథుఁడు = నా పెనిమిటి, ఎఱుఁగుర్ = తెలియును, ఇంకర్ = ఇంకమీఁదట, ఆలస్య మొనరింపర్ = జాగును జేసితిరో, ఎక్కుడగును = అధికమగును.

తా. పెదవులు పీటలు వాఱుచున్నవి అని నీటిని ఇచ్చెదరు. శరీరతాపంబునకును జెమర్చుటలకును ఓషధులను ఇచ్చెదరు. చెమ్మటకై గాలివీచెదరు. ఇట్టి శుష్కోపచారములకా నా పెను దెగలు దీఱును. నా దేహతత్వము మీకేమి యెఱుక! నానాథునికిఁ దెలియును గాక ! ఆలస్యము చేసితిరో యింకను అధికమగును.

సీ॥ అతని పేరురమున ◊ నటెత్రగుమ్మకగాని
గుబ్బలపొగరెట్లు ◊ గుదురునమ్మ,
వాతెర మొనపంట ◊ నడిగనొక్కకగాని
యధికదాహంబెట్లు ◊ లడఁగునమ్మ,
[illegible]రతబంధంబులచిక్కి ◊ స్రుక్కకగాని

గబ్బిమదంబెట్లు గఱఁగునమ్మ,
కవఁగూడి పెనఁగొని కౌఁగిలించక గాని
తమి వెగ్గలంబెట్లు తఱుఁగునమ్మ,
గీ॥ కాయ మింకను నిల్వదే కంబుకంఠి
నేనతని యాసఁ బ్రాణముల్ నిల్పినాను॥ చెలియ॥ 19

టీ. కంబుకంఠి! అతని పేరురమునన్ = అతని విశాలవక్షమ్మున, అంటి క్రుమ్మినన్ గాని = చేర్చి యొత్తినఁగాని, గుబ్బలపొగరు = స్తనముల క్రొవ్వు, ఎట్లు కుదురునమ్మ = ఎట్లు కుదుటఁబడును, వాతెరన్ = విభుని యధరంబును, మొనపంటన్ = మొనపంటిచేత, వడిగ నొక్కక గాని = వేగంబుగా నొక్కకయే - అనఁగా విభుని యధరామృతాస్వాదనమును చేయకయే, అధిక దాహంబు = మితిమీఱిన దప్పి, ఎట్టులడఁగునమ్మ = ఏవిధముగా నణఁగును, సురతబంధంబులన్ = చౌశీతిబంధములను, చిక్కి = తగులుకొని, సొక్కక గాని = సొక్కును జెందకయే, గబ్బిమదంబు = గర్వమును జెందిన మదము, ఎట్లు గఱఁగునమ్మ = ఎట్లు తగ్గును? కవఁగూడి పెనఁగొని = జంటఁగూడి పెనఁగి, కౌఁగిలించక గాని = ఆశ్లేషింపకయే, తమి వెగ్గలంబు = తహతహలతోడి యతిశయము, ఎట్లు తఱుఁగునమ్మ = ఎట్లు తగ్గును; కాయము ఇంకను నిల్వదే = శరీర మింక నిలువఁజాలదు, అతని యాసన్ = అతనిమీఁది యాసవలన, నేను ప్రాణముల్ నిల్పినాను = నేను ప్రాణములను బిగ్గపట్టియుండుదానను.

తా. అతని వక్షమ్మున నొత్తిమెఱమినఁగాని నావక్షోరుహముల గర్వమడఁగదు. అతని యధరపానవశమునఁగాని నా పెనుదప్పి తీఱదు. అతని సురతవిశేషంబున సొక్కినఁగాని నా కావరం బడఁగదు. జోడుకుజోడుగా వెనుదీయక పెనఁగిననేగాని నా తహతహలు దఱుఁగదు. ఇంక ప్రాణము లీశరీరమునంటి యుండుట యసాధ్యము - విభునిపై ఆసవలన ప్రాణములను ఇదివఱకు నిలిపియుండుదానను.

సీ॥ ఎమ్మెతోఁ బ్రాణేశు నెదుట వర్తింపని
సొమ్మేల? జగ్గేల? సొగసులేల?

కడుఁ బ్రేమవిభునెదఁ గదిసి క్రుమ్మఁగ లేని
గబ్బిచన్నవయేల? కాయమేల?
పతితోడఁ జౌశీతిబంధముల్ పెనఁగని,
తనువేల? యీచక్కఁదనము లేల?
వయసుప్రాయపువేళ వరుఁడు దగ్గఱ లేని,
బ్రదుకేల? యెచ్చుసౌభాగ్యమేల?
గీ॥ యిట్టిబలుజవ్వనపుఁగోర్కు లెట్లుదీఱుఁ;
గంట నిద్దురఁ గలనైనఁ గాననైతి ॥ చెలియ॥ 20

టీ. ఎమ్మెతోన్ =సంతోషముతో, ప్రాణేశునెదుటన్ =విభునికెదురుగా, వర్తింపని=విలసిల్లుటకుఁగాని, సొమ్మేల? జగ్గేల=కాంతియేల? సొగసులేల=శృంగారము లెందుకు? కడుఁ బ్రేమన్ =మిక్కిలి ప్రేమతో, విభునెదన్ =విభునియొక్కఱొమ్మును, కదిసి క్రుమ్మఁగన్ లేని=చేరిక్రుమ్ముటకుఁగాని, గబ్బిచన్నవయేల=గర్వభూయిష్ఠమయిన చండ్లజంటవల్ల ప్రయోజనమేమి? కాయమేల=శరీరమువల్ల ప్రయోజనంబేమి? పతితోడన్ =జీవితేశునితో, చౌశీతిబంధముల్ = అఱువదినాల్గు విధములయిన కుక్కుటాది సురతబంధములవల్ల పెనఁగియాడనట్టి, తనువేల=శరీరమువల్ల ఫలమేమి? ఈ చక్కఁదనములు ఏల= ఈసొగసులుఏల? వయసుప్రాయపువేళన్ =నిండుజవ్వనమున, వరుఁడు దగ్గఱ లేని=విభుఁడు సమీపమునందుండుటకు ఇచ్చిపెట్టుకొనని, బ్రదుకేల=జీవిత మెందుకు? ఎచ్చు సౌభాగ్యమేల? = అధికమైన సన్మంగళము లెందులకు? ఇట్టి బలుజవ్వనపుఁగోర్కులు= ఇటువంటి యధికములయిన యౌవనమునందలి కోరికలు, ఎట్లుదీఱున్ =ఎట్లు కొనసాగును? కలనైనన్ =స్వప్నమునందైనను, కంటన్ =కంటిని ఆశ్రయించిన, నిద్దురన్ =నిద్రను, కాననైతిన్ =ఎఱుఁగనైతిని.

తా. జీవితేశ్వరునిఎదుట నివసింపకుండినదానికి సొమ్ములవల్లను తేజమువల్లను సొగసులవల్లను ప్రయోజనమేమి? విభునిఱొమ్మున ఖచిక్కిన గ్రుమ్ముటకు ఇచ్చిపెట్టికొని యీవక్షోరుహంబులును శరీరమును ఎందులకు? నాథునితో 64 బంధ

ములతోడి రతినైపుణమును నెఱపని యీదేహమేల? చక్కఁదనములవియేల? యౌవనకాలములయందు పతి దగ్గఱ వసించుటకుకాని జీవితమేల? సౌభాగ్యమేల? యిన్నియును వ్యర్థములు! వ్యర్థములు! ఇట్టివయసుకాలపుఁగోర్కు లెట్లు దీఱునమ్మ? నిద్ర అన్నది కంటి కెంతో దూరమున నున్నది. ఏమిచేయుదును?

సీ॥ చెలువ సాష్టాంగంబుఁ జేసి వేఁడె నటంచుఁ,
బలుమాఱు నెనరునఁ బలుకరమ్మ
తమక మగ్గల మాయెఁ దాళఁజాల దటంచు,
వినయోక్తులను విన్నవించ రమ్మ
బిగిగబ్బిగుబ్బల పొగరు కోర్వదటంచు,
తిన్నఁగా మదినాటఁ దెల్ప రమ్మ
మాటికి నినునెంచి మఱువని పల్కులు
సెలఁగి హెచ్చెనటంచుఁ జెప్పరమ్మ
గీ॥ మరుని కేళికి రాకున్న మానెఁగాని,
మోముఁ జూపించి పొమ్మను ముద్దుగుమ్మ॥ చెలియ॥ 21

టీ. చెలువ= స్త్రీ; సాష్టాంగంబుఁన్ జేసి=అష్టాంగములు భూమికిసోకువట్లుగా నమస్కరించి, వేఁడెన్ అటంచున్=నిన్ను ప్రార్థించుకొన్నది అని, పలుమాఱున్=పలుమఱును, నెనరునన్=కృతజ్ఞతగా, పలుకరమ్మ=చెప్పరమ్మ, తమకము=తమి, అగ్గలముఆయెన్ = అధికమయ్యెను, తాళఁజాలదు అటంచున్ = ఓర్వఁజాలదు అని, వినయోక్తులను = అడఁకువతోడి మాటలుగా, విన్నవింప రమ్మ=విజ్ఞాపించరమ్మ, బిగిగబ్బిగుబ్బల పొగరుకున్ =బిగువైనవియు గర్వముగలిగినవియునైన పాలిండ్లయొక్క కావరమునకు, ఓర్వదుఅటంచున్ = సైఁపఁజాలదని, మదినాటన్ =మనస్సుకువచ్చునట్లు, తిన్నఁగాన్ = నేరుగా, తెలుపరమ్మ, మాటికిన్ నినున్ ఎంచి=పలుమఱును నిన్నే తలఁచి, మఱువనిపలుకులు= మఱపురానిమాటలు, చెలఁగి=అతిశయించి, ఎచ్చెన్ అటంచున్ =అధికమాయెనని, చెప్పరమ్మ, మరుని కేళికిన్ =రతికి, రాకున్నన్ మానెన్ కాని=రాకపో

యినప్పటికిని మానెనుగాని, ముద్దుగుమ్మ=ఓముద్దుచెలీ! మోము చూపించి పొమ్మను=ముఖదర్శన మిచ్చిపొమ్మనుము.

తా. నీ ప్రియురాలు నీకు సాష్టాంగ మెఱఁగి ప్రార్థించుచు విన్నవింపుమనెను దానికి తమకమధికమయ్యెను; తాళఁజాలదు; దానిజిగిబిగి పొగడుచునుంగవ వేఁగుకు ఓర్వదు; దానికి పలుమాఱును నిన్నుఁగూర్చిన విచారమేవచ్చెను; మన్మథక్రీడలకుగాను ఇచ్చలేకున్నను మానెనుగాని నీమోము నైననుజూపి యావిరహాసహాయయిన నాయికయొక్క తమినిని ఇంచుక పోఁగొట్టుము అని చెప్పి తోడితెమ్ము.

సీ॥ కటకటా యిటువంటి కడిదిలేఁబ్రాయంబు
విరులపానుపున కర్పింపఁబడియె
సూనశరాళికి ప్రుక్కినచన్గవ
కాయజునకు దారవోయఁబడియె
వేఁడివెన్నెలకాఁక వేగినమేనును
చెడుగుచందురుపాలు సేయఁబడియె
నగడుప్రాఁతలుప్రాసి నట్టి యాపరమేష్ఠి
సుఖ మెడఁజేయఁగాఁ జూడఁ బడియె

గీ॥ గబ్బిగుబ్బలయెదఁ గ్రుమ్మి క్రుమ్మి
యున్న సఖియలఁజూచి నోరూర సాగ॥ చెలియ॥ 22

టీ. కటకటా=అక్కటా! ఇటువంటి, కడిదిలేఁబ్రాయంబు=పొందుటకుఁగాని లేతవయస్సు, విరులపానుపునకున్=పూలశయ్యకు, అర్పింపఁబడియెన్=అర్పణము చేయఁబడెను. సూనశరాళికిన్=పుష్పబాణంబులకు, ప్రుక్కినచన్గవ=అలయికలందిన స్తనములజంట, కాయజునకున్=మన్మథునికి, దారవోయఁబడియెన్=దత్తము చేయఁబడెను, వేఁడివెన్నెలకాఁకన్=తీక్ష్ణములయిన చంద్రకిరణముల అగ్నికి, వేఁగినమేనును=కాలిన యాశరీరమును, చెడుగుచందురుపాలు=దుష్టుఁడయిన చంద్రునియధీనము, చేయఁబడియెన్=ఒనరింపఁబడెను

అగడువ్రాతలు=అట్టుకుఁదెచ్చునట్టి లేఖలను, వ్రాసినట్టి యాపరమేష్ఠి=లిఖించిన యాబ్రహ్మదేవుఁడు, సుఖమెడఁబాయఁగాన్ = నాసౌఖ్యములు తొలఁగించునట్లుగా, చూడఁబడియెన్ = కనుఁగొనఁబడెను. గబ్బిగుబ్బలన్ =గర్వించిన కుచములను, పతిమెదన్ =తమ పెనిమిటుల ఱొమ్ములను, గ్రుమ్మిగ్రుమ్మియున్న సఖియలన్ =పొడిచిపొడిచి సుఖించు కాంతలను, చూచి=కనుఁగొని, నోరూర సాగెన్ = కోర్కులుపుట్టుకొని రాసాగెను.

తా. అయ్యయో? యిట్టి దుర్ఘటమయిన యావనము పూలపానుపునకు అర్పింపఁబడెను. మన్మథబాణపాతములకునొచ్చిన యీసిబ్బరంపు గబ్బిగుబ్బలు మదనునికి దారపోయఁబడెను. పాపిచంద్రునికి వానివెన్నెలకాఁకలకుఁ గందిన యీదేహమును స్వాధీన పఱచఁబడెను.అట్టులొందునట్లు విధి వ్రాయఁగా సౌఖ్యహీనత కనుఁగొనఁబడెను. ఏమిచేయుదును? ఖచిక్కుమని తమవక్షోరుహమ్ములు నాథుల పేరురముల గ్రుమ్మిసుఖియించునట్టి పూఁబోండ్లనుగాంచి, నోరూరవలసివచ్చెను.

సీ॥ పదియేండ్లకేగబ్బి ప్రాయంబు వచ్చునో?
వచ్చినమరులిట్టు హెచ్చునేమొ?
హెచ్చెఁబో వానిపై నీవింతమరు లేమి?
మరు లాతనికి లేని మర్మమేమి?
మర్మంబు దెలియక మగువ నంపిన నేమి?
యంపిన రాను పొమ్మన్న నేమి?
పొమ్మనెఁబో మరుపోరాట మది యేమి?
పోరఁగామమతలఁ బోరలు లేమి?
గీ॥ యేమొ? యీమాయవలపు పోదేమొ మమత?
దైవమీరీతినన్నే చఁదలఁచినాఁడో?॥ చెలియ॥ 23

టీ. పదియేండ్లకున్ =ఇంక పదిసంవత్సరములు గడవఁగా, ఈగబ్బిప్రాయంబు=ఈపొగరుపట్టిన వయస్సు, వచ్చునో=వచ్చునా అనఁగా కలకాలము

యౌవనమదమున శరీరమందు డక్కి యుండునా? వచ్చినన్ =అథవా వచ్చెను పో, మరలు ఇట్లు హెచ్చునే మెయి= ఇంతటి మోహాతిశయము గలుగునేమో? ఎంతమాత్రమును గలుగఁజాలదనుట, హెచ్చెన్ పో=అట్లే యెచ్చెను అనుకొనుము, దానిపైన్ =అందులకుమీఁద, ఈవింతమరులు=ఈచిత్రమైన వ్యామోహాతిశయము, ఏమి? అతనికిన్ =విభునికి, మరులులేని మర్మము= మోహము పుట్టుటకునికి కారణము, ఏమొ? మర్మంబు తెలియక=అట్టి హేతువును దెలిసికొనక, మగువను అంపినన్ ఏమి = దూతికను పంపుటచేతమాత్రము ప్రయోజనము ఏమి?అంపినన్ =అట్లే యంపితినిబో, రాను పొమ్ము అన్నన్ ఏమి= నేను రాఁజాలనుపొమ్ము అని చెప్పఁగా ఏమిచేయవచ్చును? పొమ్మనెన్ పో=అతఁడట్లు పొమ్మనియే చెప్పెను. మరుపోరాటము అదియేమి=మన్మథుని పోరు లేమి?పోరఁగాన్ = ఇట్లు పోరు పెట్టుచుండఁగా, మమతలన్ కుంది=ప్రేమలకునొచ్చి, పొరలుటేమి పొర్లాడుటలేమి? ఏమో యీమాయవలపు=ఈమాయా వ్యామోహమన్నది యేమో? మమత యేమొపోదు=ప్రీతియేమొ యెడఁబాయదు, దైవము=విధినాథుఁడు, ఈరీతిన్ =ఇట్లు, నన్నున్ ఏచన్ తలఁచినాఁడో=నన్ను మోసగించునట్లెంచెనో?

తా. పదిసంవత్సరములకీ వయస్సు నిలిచియుండునా? నిలిచెనుపో,యీమోహముపుట్టుకొని వచ్చునా? అట్లుపుట్టుకొనివచ్చెను, ఈతీఁపులు అప్పుడెక్కడివి? ఏటిమాటలు? నాకు తుల్యముగా విభునకును ఈమరులు ఉండవలదా? ఔను, అతనికీ మరలు లేమికి కారణమేమి? అట్టి కారణమును దెలిసికొనలేక దూతికను అంపుటవల్ల ప్రయోజనంబేమి? అంపితినిపో? అతఁడు రానుపో అన్న ఏమిచేయవచ్చును? మా పోరాటములే యిట్లుండఁగా మధ్య మన్మథుని పోరాటములుగదా వచ్చెను. ఏమో? నాకేమి చెప్పుటకును వలను పడదు. ఈమాయ వలపును ఈమమతయును దొలఁగకున్నవి. నన్నెట్లు హింసింప విధినాథుఁడు దలఁచియుండువాఁడో?

సీ॥ తమిచాల హెచ్చెనే ఽ తా బాసలిచ్చెనే
యాఁజడివుచ్చెనే ఽ యతివలార

వలపెందు డాతునే ॥ వరు నెట్లుచూతునే ?
నేనేమిసేతునే ॥ నెలంతలార !
హితనైనబాలనే ॥ యెపుడువాదేలనే ?
యింకఁ దాళఁ జాలనే ॥ యింతులార !
వలరాజు డాసెనే ॥ వడినమ్ములేసెనే
విభుఁడెడఁబాసెనే॥ వెలందులార !

గీ. మనసిజాశుగదావాగ్ని ॥ మధ్యమందు
నిన్నుఁదలఁచుచుఁ దపియించు ॥ చున్నదనరె॥ చెలియ॥ 24

టీ. అతివలార= స్త్రీలార! తమి=తమకము, చాలహెచ్చె నే=మిగుల నధికమయ్యెను. తా బాసలిచ్చె నే= తాను మొదట నాకు నమ్మకములను ఇచ్చియుండె నే. ఆఁడిపుచ్చె నే=(ఇప్పుడవన్నియును) ఆఁడిపోనిచ్చెను. నెలంతలార! వలపున్ =మోహమును, ఎందు దాతు నే=ఎచ్చట దాఁచిపెట్టుదును. వరున్ ఎట్లు చూతు నే=భర్తనుఎట్లు చూడఁగలను? నేనేమి సేతు నే= నేనేమి చేయుదును ? ఇంతులార! హితనైనబాల నే= నేనతనికిఁ గూర్చుపడుచను. ఎపుడువాదేల నే=ఎప్పటికిని ఈవాదులేల? ఇంకన్ తాళఁజాల నే=ఇంక నోర్వజాలను. వెలందులార! వలరాజు=మదనుఁడు, డాసె నే=దగ్గఱించె నే, వడిన్ =వేగముతో, అమ్ములేసె నే=బాణములేసె నే, విభుఁడెడఁబాసె నే=కాంతుఁడు తొలఁగిచనె నే, మనసిజాశుదావాగ్నిమధ్యమందున్ =మన్మథునిబాణాగ్ని అనెడి కార్చిచ్చునడుమ, నిన్నె తలఁచుచున్ =నిన్నే తలపోయుచు, తపియించుచున్నది అనరె= వేఁగుచున్నది అని చెప్పరే.

తా. తమిమోహెచ్చుచున్నది. తాను మునుపు నాకు బాసలిచ్చినవాఁడు, ఇప్పుడు ఆఁడివెట్టెనే. ఈవలపును ఎక్కడ దాఁచిపెట్టుదును? వరుని నేరీతిగాఁ జూడఁగలను? ఏమిచేయుదును ? అతనికి ప్రేమాస్పదురాలగు బాలనుగదే నేను. ఈపాడువాదులాటలేలనే ? విభుఁడెడఁబాసెనుగదే, చెలులారా ! "మన్మథాశుగాగ్ని" అనునట్టి కార్చిచ్చులోఁ బడి తపియించుచున్నదియని యతనితో చెప్పరే.

సీ. కోమలి నెఱికురుల్ కొప్పునకందెనా?
వింజామరలసేవ వేడ్కఁ జేతు;
మగువవాఙ్మాధురి మాటాడ నేర్చెనా?
చూరవుత్తును బంచదార రాశి
చెలియపాలిండ్లు పూఁజెండులంతయ్యెనా?
యమరింతుఁ బైఁడికుంభముల గుడిని;
ఏణాక్షి వేఁగమీఁదేరి నన్నొందెనా
చేయింతుఁ దిరునాళ్లు శ్రీధవునకు;
గీ. నంచు నాకని వేల్పుల కందఱకును
మ్రొక్కి, నన్నేలినాఁడమ్మ మోహనాంగి॥ చెలియ॥ 25

టీ. కోమలి నెఱికురుల్ = పడుచుయొక్క దట్టమయిన వెండ్రుకలు, కొప్పునకున్ అందెనా = కొప్పువెట్టుటకు చాలినంతయాయెనో? (ఓస్వామీ!) నీకు వేడ్కన్ = వినోదముగా, వింజామరలసేవన్ చేతున్ = వింజామరలతో సేవ చేయుదును. (ఇచ్చో "చేతు" లక్షణవిరుద్ధము) మగువ = ఇంతి, వాఙ్మాధురిన్ = మధురమైన, అనఁగా — తియ్యనిమాటలతో, మాటాడన్ నేర్చెనా = మాట్లాడఁజాలెనా, పంచదార రాశిన్ = చక్కెరకుప్పను, చూరవుత్తును = చూఱవోనిత్తును. చెలియ...అయెనా = ప్రియురాలి వక్షోరుహములు పూలచెండ్లంతాయెనో? గుడిని = నీదేవాలయముపై, పైఁడికుంభమున్ = స్వర్ణకలశమును, అమరింతున్ = పూన్చుదును. ఏణాక్షి = మృగలోచన, వేఁగమీఁదేరి = త్వరగా వయసున్నాని, నన్నొందెనా = నన్నుఁజేరెనా? శ్రీధవునకున్ = లక్ష్మీకాంతునకు, తిరునాళ్లు = ఉత్సవము (ఇది అన్యదేశ్యము.) చేయింతున్ = ఒనరింతును. అంచున్, నాకని = నన్నుఁ గూర్చి, వేల్పులకందఱికిని = దేవతలకందఱకును, మ్రొక్కి = వేఁడుకొని, మోహనాంగి = మోహింపఁజేయు నవయవములఁ గలదానా? నన్నేలినాఁడమ్మ = నన్ను ఏలెనుగదమ్మ.

తా. ఓమోహనాంగీ! తన దైవముంగూర్చి నావయఃపరిపక్వమునకై ప్రార్థించుకొని నన్నేలెను.

సీ. గోముగా నాకురుల్ గొప్పవెట్టినవార్త
సకియ చెప్పినబన్న సరము లొసఁగె
నట, చనుల్ నిమ్మపండ్లం తలాయె నటంచుఁ
బల్కినబోఁటికిఁ బతక మొసఁగె
నందమౌనూఁగుటా రమరినసద్వార్త
మగువ సెప్పిన కంఠ మాల నొసఁగె
నతిశుభంబుగ ఋతు మతినై నవార్తలీ
వెఱిఁగింప వేవరా లిచ్చె నీకు
గీ. నిట్లు నామీఁది ప్రేమచే నీవులొసఁగి
మచ్చికలు చేసియపుడయా మమత మఱచె॥ చెలియ॥ 26

టీ. గోముగాఁ =అందముగా, కొప్పవెట్టినవార్త, సకియ=చెలి, చెప్పినఁ బన్నసరములు=హారములు, ఇచ్చెఁ, అటఁ ... ఆయెనటంచుఁ =అంతట కుచములు నిమ్మపండ్లంత ఆయెనని, పల్కినబోఁటికిఁ =చెప్పినకాంతకు, పతకమొసఁగెఁ =పతకమిచ్చెను, మగువ=చెలికత్తెయొకతె, అందమౌనూగుటారు=అందమయిననూగారు (ఇచ్చటటుగాగమము చింత్యము) అమరినసద్వార్తఁ =ఏర్పడిన క్షేమవర్తమానమును, చెప్పినఁ =చెప్పఁగా, కంఠమాలఁ =కంఠహారమును, ఒసఁగెఁ =ఇచ్చెను. ఈవు=నీవు, అతిశుభంబుగాఁ = మిగులమంగళంబుగా, ఋతుమతిని ఐనవార్తలు = రజస్వలనైనసంగతులను, ఎఱిఁగింపఁ = తెలుపఁగా, వేవరాలు=వేయినిష్కములను, నీకుఁ ఇచ్చెఁ =నీకొసఁగెను. ఇట్లు = ఇవ్విధముగా, నామీఁది ప్రేమచేఁ =నామీఁది ప్రియముచేత, ఈవులొసఁగి= బహుమతులను జేసి, మచ్చికలుచేసి = స్నేహించి, అపుడె = అప్పుడే, ఆమమతఁ =ఆప్రియమును, మఱచెఁ = మఱచిపోయెను.

తా. ముచ్చటగా నాకు కొప్పను దిద్దినసంగతిని పోయి చెప్పినకాంతకు బన్నసరములు ఇచ్చెను. యౌవనాంకురమును గూర్చిన సూచనములను జెప్పిన కామినీమణులకుఁ బతకమును కంఠమాలయును నిష్కసహస్రమ్మునుగా నా

మీఁది ప్రేమోత్కంఠతచేత నొసఁగి, నాతోడ మచ్చికలగ వెలఁదియఁ తలో నన్నిటిని మఱచినాఁడు గదమ్మ.

సీ. జంపులై సొంపులై జాఱునీ కురులకు
సామ్యమోబిరుసైన చామరములు?
నిష్కళంకంబైన నీమోము తేఁటకు
సకళంక చంద్రమ సాటియగునె?
నీమధురాధర నిర్మలరుచికి నీ
రసమాప్రవాళవారంబు సరియె?
కఠినముల్ మృదువులు గాని నీచండ్లకు
జంటనుండెడు కలశములు సరియె?
గీ. యని గణించిన కదలెన్న నలవియగునె?
నమ్మికలఁగూర్చి యిట్లేచ నాయమగునె॥ చెలియ॥ 27

టీ. జంపులై = జంపులవలె చెవులయొద్ద నల్లలనాడునవియై, సొంపులై = రమణీయములై, జాఱునీకురులకున్ = వ్రేలాడుచున్నట్టి నీవెంట్రుకలకు, బిఱుసైనచామరములు = బిఱుసుఁదనమును గలిగిన చమరీమృగమువెంట్రుకలు, సామ్యమో = సమము చేయఁదగునా? నిష్కళంకంబు ఐననీమోముఁదేటకున్ = కళంకములేని నీముఖమునందలి తేటకు, సకళంకచంద్రమ = కలంకంబుతోడి చంద్రుండు, సాటియగునే=సమానుఁడా? నీమధురాధరనిర్మలరుచికిన్ =మాధుర్యముతోఁ గూడినట్టి నీమోవియొక్క కాంతులకు, నీరసమాప్రవాళవారంబు= రసహీనమైన పవడములయొక్క గుంపు, సరియె=సమానమగునా? కఠినముల్మృదువులుగాని=కాఠిన్యములుగాఁగాని మెత్తనివిగాఁగానియుండని, నీచండ్లకున్, జంటన్ ఉండెడుకలశములు = జతకూడియున్నట్టికుంభములు, సరియె=సమానములగునా? అని గణించినకతలు = అని లెక్కపెట్టినట్టి పూర్వపుకథలనన్నిటిని, ఎన్నన్ = లెక్కించుటకు, అలవియగునె = సాధ్యమగునా? నమ్మికలంగూర్చి=నమ్మించి, ఇట్లేచన్ =ఇట్లు మోసగించుట, నాయమటవె=నీతియా?

తా. చెవులకు పెట్టని జంపులుగా, మనోజ్ఞతలనుగూర్చుచు రంజిల్లునట్టి నీముంగురులమొత్తముతో చమరీమృగముల కఠినములయిన వెండ్రుకలను దెచ్చి పోల్చుట యుక్తమగునా? కలంకములేక తేటగాఁ దేజరిల్లు నీముఖబింబము నకు సకలంకుఁడైన చంద్రుని యెట్లు పోల్పవచ్చును? మాధుర్యసుధలతో మ హిమలొందునట్టి నీయధరంబునకా సామ్యమగును ఆ నీరసప్రవాళము? నాతి కఠినములును నాతిమృదువులును అయిన నీవక్షోరుహములతో కనకకలశద్వయ మును పోల్చుట న్యూనోపమ మగునుగదా? అని పరిపరివిధములుగా గణించిన తొల్లింటికథలను ఇపుడు గణించుట కలవియగునో? అమ్మరో! యిట్లు నమ్మించి మోసగింప నతనికి న్యాయమగునా?

సీ. విరులుకొప్పున దోఁపు ♦ వేడ్కమైఁ జూచుమే
సొమ్ములందగవేసి ♦ చోద్యమందు
దిలకంబు చక్కఁగా ♦ దిద్దిముద్దిడుకొను
కంచుకంబును బూన్చి ♦ కౌఁగిలించు
వలువజగ్గుగఁగట్టి ♦ వగఁగని మోదించు
పైటసొంపుగదిద్ది ♦ బ్రమసిపొంగు
గడె గడె కొకవింత ♦ గాను శృంగారించి
తలయూచి యజునిస్తోత్రంబు సేయు
గీ. నింతి! యతిమోహియైన ప్రాణేశుఁ డిట్లు
నన్నుఁ బాయుటకలనొక ♦ నాటి కెఱుఁగ॥ చెలియ॥ 28

టీ. కొప్పునన్ = కబరీభరంబునందు, విరులన్ దోఁపును = పూలనుదుఱు మును, వేడ్కమైచూచును = వినోదముగాఁజూచును, మే=దేహమందు, సొ మ్ములనుదగన్ = బాగుగావేసి, చోద్యమొందున్ = ఆశ్చర్యపడును, చక్కఁగాన్ = అందముగాఁతిలకంబుదిద్ది=తిలకమునుదీర్చి, ముద్దిడుకొనున్ = ముద్దువెట్టుకొ నును, కంచుకంబునుపూన్చి=రవికనుదొడిగించి, కౌఁగిలించున్ =ఆలింగనమును జేసికొనును. జగ్గుగన్ =నీఁటుగా, వలువఁగట్టి=చీరఁగట్టించి, వగఁగని=నాసొ

యగమునుజూచి, మోదించుర్ = సంతసించును. పైటర్ = నాపయ్యెదను, తీవిగర్ తీర్చి = అందముగాదిద్ది, భ్రమసిపొంగుర్ = భ్రమించియాశ్చర్యపడును. గడియకుర్ = క్షణక్షణంబునకు, ఒకవింతగాను = ఒక్కొక్కవైఖరిగాను, శృంగారించి = సింగారమునుజేసి, తలయూఁచి = మెచ్చి, అజునిర్ స్తోత్రంబు సేయుర్ = (అట్టియుత్తమగా యిలను సృష్టించిన కౌశలమునకై) బ్రహ్మదేవుని పొగడును. ఇంతి = ఓ చెలీ! అతిమోహియైనప్రాణేశుఁడు = నాయెడల మిగుల మోహమునుగొన్న జీవితేశుఁడు. ఇట్లునన్నుఁబాయుట = ఇట్లు నన్నెడఁబాసియుండుటను, కలర్ = స్వప్నమునందును, ఒకనాఁటికిర్ = ఎన్నటికిని, ఎఱుఁగర్ = తెలియను.

తా. కొప్పుదిద్ది వేడ్కతో చూచును; సొమ్ములనుదాల్చి చోద్యపడును; తిలకంబుదిద్ది ముద్దిడుకొనును, కంచుకంబును పూన్చి ఆలింగనము చేసికొనును. వలువనుగట్టించి నావింతవగలను మోదించును, పైఁటలసవరించి భ్రమసినుతించును. నన్ను గడియకొకవిధముగా కైసేసి, యొప్పిదములకు నానందమొంది తలయూఁచి సృష్టికర్తను స్తుతించును. అక్కటా! చెలీ! నాయెడ మిగుల మోహమును గొనియున్న నాజీవితేశుఁడు ఇట్లు నన్నెడఁబాసియుండఁగలఁడని యే నాఁడును దెలిసినదానను గాను.

సీ. సుదతినీ నెమ్మోము ♦ సుందరంబును జూచి
    యిందు బింబముఁజూచు ♦ నిచ్చ తోలఁగ
పొలఁతి నీ గుబ్బల ♦ పొంకంబులను జూచి
    కమ్మఁజక్కవలఁ జూచు ♦ కాంక్షతొలఁగ
కలికి నీసోగక ♦ న్నులయందమును జూచి
    మఱిమీనములఁ జూచు ♦ మమత లుడిగె
పడఁతి నీచొక్తి ♦ బంధురీతులఁ జూచి
    యన్యకాంతలఁ గోరు ♦ నాసలుడిగె
గీ. ననిన మమతలనానాఁడె ♦ యాఱుమూఁడు
    సేసి మఱచెను నేనేమి ♦ సేతునమ్మ! - చెలియ ॥ 29

టీ. సుదతి!=ఓప్రాణేశ్వరీ! నీసెమ్మోముసుందరంబునుజూచి = నీముఖము యొక్క చక్కఁదనమునుచూచి, ఇందుబింబముఁ జూచు నిచ్ఛ = చంద్ర మండలమును చూడవలయునను నాసక్తి, తొలఁగెఁ=పోయెను. పొలఁతి! నీ గుబ్బలపొంకంబులనుచూచి = నీ స్తనములపొందికలనుచూచి, కడుఁ =మిక్కిలిగా, జక్కవలనుచూచుకాంక్ష = చక్రవాకంబులను చూచునట్టియాస, త ప్పెఁ =తొలఁగెను. కలికి = ఓమనోజ్ఞవతీ; నీసోగకన్నులయందమునుజూచి= నీవాలుకన్నవలకీవినిజూచి, మఱిమీనములఁజూచుమమతలు = మత్స్యంబులను వీక్షించునట్టి యడియాసలు; ఉడిగెఁ =వదలెను. పడఁతి = ఓకాంతా! నీచా తీతిబంధరీతులఁ చూచి = నీచే రచింపఁబడునట్టి బంధముల నైపుణమును గనుఁ గొని, అన్యకాంతలఁ గోరునాసలు = పరకీయనాయికలయందలిప్రేమలు, ఉ డిగెఁ =వీడెను. అనినమమతలఁ =అన్నట్టిప్రేమాతిశయవాక్యములను, ఆనాఁ డె=అప్పుడే, ఆఱుమూఁడుచేసి= పటాపంచలుచేసి, మఱచెను=నన్ను విస్మరించెను. ఏనేమి సేతునమ్మ= నే నేమిచేయుదును.

తా. "ఓప్రాణేశ్వరీ! నీసుందరమైనముఖమును దర్శించినపిమ్మట చంద్రదర్శనము ఇంపుగొల్పదు. నీబటువైనగుబ్బలపొంకంబుం గనుంగొనిన పిమ్మట జక్కవలు చూపును చోద్యమొనఁగూర్పదు. నీనేత్రములసోయగంబును జూచినపిమ్మట గండుమీలను జూచునాసక్తిపుట్టదు. పడఁతిరో! నీబంధనైపుణుల కెదమోదించినవెనుక యితరకామినుల కూటములకు నిచ్ఛఁగొనదు". అనిన ప్రేమోత్కంఠవచనములను నాఁటికే మఱచినాఁడమ్మ ఏమిచేయుదును?

సీ. కలువలు నీసోఁగకండ్లఁ బోలుటఁ జేసి
యవి దేవతలికి యోగ్యంబులయ్యెఁ
జక్రవాకములు నీచన్నవఁబోలఁగా
మిన్నగా సత్కృతు లెన్నఁగల్గె
పగడంబునీమోవిపగిదిని దీపింపఁ
దొమ్మిదోరత్నమై యొమ్మెఁగాంచె

నళులు నీకురులనైల్యంబులఁ బోలఁగా
మారునారిగ మీఱి మహిమఁ గాంచె
గీ. నినుసృజించినయజుని వర్ణింపఁదరమె !
యనిమనోహరుఁడీలాగు ననుఁగణించు॥ చెలియ॥ 30

టీ. కలువలు = కైరవములు, నీసోగకండ్లన్ పోలుటంజేసి=నీవాలుకండ్లను పోలియుండుటవలన, అవి=ఆకలువలు, దేవతతికిన్ =దేవతలకు, యోగ్యంబులు అయ్యెన్ =పూజార్హములాయెను. చక్రవాకములు = జక్కవపిట్టలు, నీచన్గవఁబోలఁగాన్ =నీచన్దోయిని పోలియుండుటంబట్టి, మిన్నగాన్ =ఘనముగా, సత్కవులు=కవీంద్రులు, ఎన్నన్ గలిగెన్ =గణింపనాయెను, పగడంబు=ప్రవాళంబు, నీమోవిపగిదిన్ =నీయధరము విధమున, దీపింపన్ =ప్రకాశించుటంజేసి తొమ్మిదోరత్నమై = తొమ్మిదవరత్నమై (తొమ్మిదో అన్నది గ్రామ్యరూపము) ఎమ్మెన్ కాంచెను=అందమొందెను. అళులు=తుమ్మెదలు, నీకురుల నైల్యంబులన్ =నీవెండ్రుకల నీలిమలను, పోలఁగాన్ =పోలుటచేతనే, మారునారిగన్ = మన్మథుని వింటినారిగా, మీఱి=అతిశయించి, మహిమన్ కాంచెన్ =మహిమలొందెను. నిను సృజియించినయజునిన్ = నిన్నుసృష్టించిన బ్రహ్మదేవుని, వర్ణింపన్ తరమె=స్తుతింపసాధ్యమగునా; అని = ఇట్లుచెప్పుచును, మనోహరుఁడు= విభుఁడు, ఈలాగుగణించున్ =ఇట్లుస్తుతించును.

తా. కాంతా! నీకండ్లను పోలుటచేతఁ గాదా కలువలు దేవతల కర్హమయ్యెను. చక్రవాకములు నీకుచములను బోలుటచేతఁగదా కవులవర్ణనలకెక్కెను. పగడము నీమోవిని బోలుటంజేసిగదా అదితొమ్మిదవ రత్నముగా పరిగణింపఁబడుట. నీవెండ్రుకల నీలిమనుబోలిననీలిమనుశరీరచ్ఛాయగాఁ గలిగియుండుటంబట్టిగదా తుమ్మెదలు మన్మథునిచే నారిగానంగీకరింపఁబడెను. నిన్నుపుట్టించిన బ్రహ్మదేవుని పొగడుటకు సాధ్యమగునా?'' అని మనోహరుఁడు నన్నుగారవించుచుండును.

సీ. కమలాక్షి యను వాలుకన్నులజిగిఁజూచి
శశిలేఖయనుమోము సౌరుఁజూచి

బింబాధరా! యనుఁ, బెదవినిగ్గులఁజూచి
యలివేణి! యను, గుంతలాళిఁజూచి
గురుకుచా! యను, గబ్బిగుబ్బలొప్పఁగఁజూచి
హరిమధ్య యను, సుమధ్యంబుఁ జూచి
గజయాన! యను, మందగతులచోద్యముఁజూచి
లలితాంగి యను మేనిచెలువుఁజూచి
గీ. గడియకొకపేరుననుఁ బిల్చి గారవించు
దైతునకు నివ్వనేఁగానిదాన నైతి॥ చెలియ॥ 31

టీ. వాలుకన్నుల జిగిన్ జూచి=సోగకన్నుల కాంతిని చూచి, కమలాక్షియనున్=(అన్వర్థగా) తామరసాక్షియని పిలుచును. మోముసొరున్ చూచి=ముఖమునందమునుజూచి, శశిలేఖయనున్=చంద్రరేఖాయని పిలుచును. పెదవినిగ్గులన్ చూచి=మోవికాంతులను జూచి, బింబాధరాయనున్=దొండపండువంటి పెదవిగలదానా! యనిపిలుచును. కుంతలాళింజూచి=వెంట్రుకలగుంపునుజూచి, అలివేణియనున్=భ్రమరములవంటిజడగలదానా! యనిపిలుచును. గబ్బిగుబ్బలు=పాలిండ్లను, ఒప్పగన్ చూచి=చక్కఁగఁగన్గొని, గురుకుచాయనున్=ఉన్నతస్తనములు గలదానా! యనును. మధ్యంబున్ చూచి=నడుమునందమును జూచి, హరిమధ్యయనును=సింహమధ్యా యనిపిలుచును. మందగతులచోద్యమున్ చూచి=మెల్లనియొయ్యారపునడకలను జూచి, గజయానయనున్=గజరాజగమనాయని పిలుచును. మేనిచెలువున్ చూచి, శరీరమునందమునుజూచి, లలితాంగియనున్=లలితాంగీయని పిలుచును. గడియకున్=క్షణమునకు, ఒకపేరున నుబిల్చి=ఒకపేరును పెట్టి, గారవించు = గౌరవించునట్టి, దైతునకున్=కాంతునకు, ఇపుడు నేఁగానిదానను ఐతిన్ = ఇప్పుడు నేను పగదాననైతిని.

తా. కండ్లయందమునుజూచి కమలాక్షీయని పిలుచును. మోమునందమును జూచి శశిలేఖయని పిల్చును. పెదవినిగ్గునుచూచి బింబాధరయని పిలుచును. వెంట్రుకలయందమునుజూచి యలివేణీ యనిపిలుచును. వక్షోరుహములతీవిని గాంచి

గురుకుచా యనిసంబోధించును. నడుమునొయారమునుజూచి సిమ్హమధ్యాయని పిలుచును, మందగమనములనుజూచి గజయాన ! యనిపిలుచును. శరీరసౌందర్యం బునుంజూచి లలితాంగీయని పేర్కొనును. ఇట్లు గడియకొకపేరితో పిలిచి న న్నాగారవించినట్టివిభునికి నేనిప్పుడు పగదాననుగదాయైతిని.

సీ. తిలకంబునీటుగాఁదిద్ది మోమటుచూచి
బలుదర్పణముఁద్రిప్పి పాఱవైచు
కురులుకొప్పమరించి విరివిగా నటుచూచి
విడినీలములఁద్రిప్పి విసరివైచు
కంచుకం బమరించి కడువేడ్క నటుచూచి
పూలబంతులఁద్రిప్పి పుడమి వైచు
సొమ్ము శృంగారించి సుందరం బటుచూచి
తెప్పునరత్నముల్ ద్రిప్పివైచు
గీ. నిన్నివిధముల నన్ను మోహించి యేలు
మచ్చికలనెట్లు మదిలోనమఱచినాఁడొ॥ చెలియ॥ 32

టీ. నీటుగాన్ = అందముగా, తిలకంబున్ దిద్ది=బొట్టునుదీర్చి, మోముఅ టుచూచి=ముఖముయొక్క సౌమ్యతనువీక్షించి, బలుదర్పణమున్ = మేలైనయ ద్దమును, ద్రిప్పి=మోముకు దృష్టిదోషముతీఱునట్లుచుట్టి, పాఱవైచున్ =పా ఱవేయును. కురులు కొప్పమరించి=కబరీభరంబును రచించి, విరివిగాన్ అటు చూచి=అశ్లేయాసోయగంబునుజూచి, విడినీలములన్ =నీలమణులను, ద్రిప్పివి సరివైచున్ =నివాళించిపాఱవేయును. కంచుకంబమరించి=అవికఁదొడిగించి, క డువేడ్కన్ =మిగులవినోదముగా, అటున్ చూచి=దర్శించి, పూలబంతులన్ = పూలచెండ్లనుచుట్టి,పుడమివైచున్ =భూమిపైపాఱవైచును,సొమ్ముశృంగారించి= నగలచే నలంకరించి,సుందరంబున్ అటుచూచి=అందమునుచూచి, తెప్పునన్ = తటాలున, రత్నముల్, ద్రిప్పివైచున్ =దృష్టిదీయును, ఇన్నివిధములన్ =ఇన్ని రీతులుగా, నన్ను మోహించియేలు = నన్ను మోహించియేలునట్టి, మచ్చికలన్ =

వాఁడుకలను, ఎట్లుమదిలోనన్ మఱచినాఁడో=ఎవ్విధముగా మనస్సునందు మఱపుచెందినాఁడో?

తా. నొసటతిలకమునుదీర్చి ముఖము నందమునుజూచి దృష్టిపరిహారార్థము అద్దమునుచుట్టి పాఱవైచును. కొప్పువేసిచూచి విడినీలిమణులను చుట్టివైచును. రవికనుఁదొడిగి అందమునుజూచి పూలబంతులను ద్రిప్పిపాఱవైచును. నగలను పూనిచి అందమును గండ్లారఁజూచి, రత్నములను నివాళించిపాఱవైచును. ఇన్నిరీతులుగా మోహించి నన్నేలుచుండిన ప్రాణేశ్వరుఁ డిప్పుడు మనస్సులో నాస్మరణను వహింపఁడు. ఎట్లు మఱచినాఁడో తెలియదు.

సీ. "అతివ నేనీమధురాధరంబునుగ్రోల
నాసుధామధురంబు లరుచులయ్యె
నీమోముకళ లహర్నిశమునుజూచిన
నిందుబింబముఁజూచు నిచ్చదొలఁగె
భామ నీపాలిండ్లపైఁ బవ్వళింపఁగా
శేషతల్పముమీఁదిచిత్త మెడలె
రామనీయావనరాజ్యంబునేలుచో
సకలాధిపత్య మసహ్యమయ్యె
గీ. నింకనినుబాయఁజాల నేనెన్నటికిని"
అనినమాటలమఱచినాఁ డల్లనాఁడొ॥ చెలియ॥ 33

టీ. అతివ = ఓకాంతా! నేను నీమధురాధరంబును గ్రోలఁగాన్ =తీఁపైన నీమోవిసుధలను ఆనఁగా, ఆసుధామధురంబులు=ఆయమృతపుతియ్యఁదనములు, అరుచులయ్యెన్=రుచులులేనివయ్యెను. అహర్నిశమును=పగలునురేయియును, నీ మోముకళలను చూచినన్=నీముఖమునందలి తేఁటలను చూడఁగా, ఇందుబింబమున్=చంద్రమండలమును, చూచునిచ్చ=చూడవలయును అనునాస, తొలఁగెన్=వీడెను. భామ! నీపాలిండ్లపైన్ బవ్వళింపఁగాన్=నీకుచములపై పరుండఁగా, శేషతల్పముమీఁదిచిత్తము=ఆదిశేషునిపై పరుండవలయుననుకోర్కె, ఎడ

లేక్ =పీడెను. రామ! నీయౌవన రాజ్యంబును=నీవయస్సనెడి సామ్రాజ్యమును, ఏలుచోక్ =పరిపాలించునప్పుడు, సకలాధిపత్యము=భూమిపరిపాలనము. అనవ్యామయ్యెక్ =ఇంపుపుట్టనిదాయెను. నేను, ఎన్నటికిని=ఎప్పటికిని, నినుఁబాయఁజాలను=నిన్నువదలలేను; అనిన మాటలక్ =అన్నమాటలను, అల్లనాఁడె=ఆదినమే, మఱచినాఁడు=విస్మరించినాఁడు.

తా. ఓజీవితేశ్వరీ! నీయధరామృతమువలె దివ్యామృతము రుచినిగలిగింపదు. నీమోముకళలనుజూచి కండ్లకు కళానిధిబింబమును దర్శింప ఇచ్ఛపుట్టదు. నీవక్షోరుహంబులపై పరుండిన నాకు శేషతల్పముమీఁదియాస కొనసాగదు. నీవయోరాజ్యపాలనముతప్ప భూపరిపాలనముమీఁద బుద్ధి పుట్టదు. ఇంక నెప్పటికిని నిన్నెడఁబాసియుండఁజాలను అన్నమాట లన్నిటిని చెలియా! నాటికే మఱచినాఁడు.

సీ. కడుమేలు గా జాతకములు వ్రాసిరిగాని
పతియొల్లఁ డనుచు దైవజ్ఞు లనరు
సాముద్రికముఁజూచి సంతసించిరిగాని
నొచ్చుకొందు నటంచు నుడువరైరి
పొంతనంబులు చాలఁబొందు లందురుగాని
యెప్పు డీయెడఁబాట్లఁ జెప్పరైరి
ప్రేమనేలు నటంచుఁబెండ్లి సేసిరిగాని
యతిజారుఁ డని ప్రాజ్ఞు లాడరైరి
గీ. యందఱు భ్రమింప నతనికి నజుఁడు గూర్చె
నిపుడు తలపోసినందుల నేమిఫలము॥ చెలియ॥ 34

టీ. కడుమేలుగాక్ =మిగుల మేలిమిగా, జాతకములు వ్రాసిరిగాని=జన్మపత్రికలురచించిరిగాని, పతియొల్లఁడు అనుచుక్ =మగఁడు తిరస్కరింపఁగలఁడు అని, దైవజ్ఞులు=జ్యోతిష్కులు, అనరు=చెప్పరు. సాముద్రికముక్ చూచి=రేఖాశాస్త్రమునుజూచి, సంతసించిరిగాని=సంతోషమొందిరేగాని, నొచ్చుకొందుక్ ,

అటంచుఁ=చింతాకులయగుదునని. నుడువరైరి=చెప్పఁజాలకపోయిరి. పొంత నంబులు=రజ్జుఆదిగాఁగలపొందికలు, చాల పొందులు=మిగుల పొందికలనుజెందినవి, (అని) అందురుగాని=చెప్పుదురుగాని, ఎప్పుడును ఈ యెడఁబాట్లు చెప్పరైరి=ఎప్పటికిని ఈవిరహంబునుగూర్చి చెప్పరు. ప్రేమ నేలుఁ=ప్రీతితో ఏలికొనును, అటంచుఁ=అనిభావించి, పెండ్లిచేసిరిగాని=వివాహ మొనర్చిరిగాని, ప్రాజ్ఞులు=తెలిసినవారు, అతిజారుఁడు=మిగుల స్త్రీలోలుఁడు, అనిఆడరైరి=అని చెప్పకపోయిరి. అందఱుఁ=ఇట్టి జ్యోతిషాది శాస్త్రవేత్తలు అందఱును, భ్రమింపఁ=భ్రమచెందునట్లుగా, అతనికి=విభునికి, అజుఁడుకూర్చెఁ=(ఇట్టిగుణమును) బ్రహ్మదేవుఁడు కలిగించెను. ఇపుడు తలపోసినందులఁ=వీనినన్నిఁటిని ఇప్పుడుతలఁచుటలచేత, ఏమిగుణము=ప్రయోజన మేమి ?

తా. జ్యోతిష్కులు మేలిమిగా జాతకములను వ్రాసిరిగాని "భర్తయొల్లఁడు దీనిని" అని యే దైవజ్ఞుఁడును జెప్పఁడు. రేఖావిధానములనుగూర్చిపండితులు సంతసించిరిగాని, నేను విభునికై నొచ్చుకొందునఁటంచ చొక్కరును చెప్పరు, పొంతనములు సతీపతులకు మిగుల పొందికలని వచించిరిగాని, యీవియోగంబుంగూర్చి యెవ్వరును సూచించినారుగారు. ప్రీతితో పతి దీని నేలికొనునటంచు నుద్వాహ మొనరించిరిగాని, యితఁ డతిజారుఁడని యే ప్రాజ్ఞుఁడును నుడువఁడయ్యెను. ఇట్టివిద్వద్వరులు ఇందఱును భ్రమయునట్లు బ్రహ్మదేవుఁడే మొ యతని కిట్టి గుణములు గూర్చినాఁడు. వీనినన్నిటిని ఇప్పుడు తలఁచుటచేఁ బ్రయోజనం బేమి ?

సీ. తరుణిరో! నానిశ్చితంబునకై రాఁగ
 ద్విజులిద్దఱెదురైరి తెరువులోన
నింతిరో! వరునిఁ దేనేగఁగా నావేళఁ
 బూర్ణకుంభంబులు పొడమనెదుట
సుదతిరో! మంగళసూత్రంబు గట్టఁగా
 బహుశుభంబుగ గౌళి పలికెనపుడు

వెలఁది! నేను గృహప్రవేశంబు సేయఁగా
తీరుగా గరుడుండుౝ తీర్చితిఱిగె
గీ. శకునదేవతలెల్ల నాౝశత్రులగుచు
నిట్టినిర్దయునకుఁగూర్చిౝరేమి సేతు॥ చెలియ॥ 35

టీ. తరుణిరో=చెలీ! నానిశ్చితంబునకై రాఁగన్=నానిశ్చితార్థంబునకై రాఁగా, తెరువులోనన్=మార్గమందు, ద్విజులిద్దఱు=ఇరువురు బ్రాహ్మణులు, ఎదురైరి=ఎదురుపడిరి (అనఁగా శుభశకునమాయెననుట.) ఇంతిరో=స్త్రీ! వరుని తేన్ ఏగఁగాన్=పెండ్లికొడుకును దేఁబోవునపుడు, ఆవేళన్=అట్టికాలమున, ఎదుటన్ పూర్ణకుంభములు పొడమెన్=ఎదురుగా జలపూరితకుంభములు దోఁచెను. సుదతిరో=కాంతా! మంగళసూత్రంబుగట్టఁగాన్=మంగళసూత్రధారణము చేయుకాలమున, అపుడు, కడుశుభంబుగన్=మిక్కిలి మంగళకరముగా, గౌళి పలికెన్=బల్లిపలికెను, వెలఁది=ఓ చెలీ! నేను గృహప్రవేశంబు చేయఁగాన్= వరునింటిని ప్రవేశించుకాలంబున, తీరుగాన్ = పొందికగా, గరుడుఁడు=గరుత్మంతుఁడు, తీర్చితిఱిఁగెన్ = సవ్యాపసవ్యములకుఁ దీర్చితిఱిగెను, శకునదేవతలు= శుభసూచనముల తెలుపుటకు అధిదైవతములైనవి యన్నియును, నా శత్రులగుచున్=నాకువిరోధులగుచు, ఇట్టి నిర్దయునకున్=ఇటువంటి దయలేనివానికి, కూర్చిరి=కట్టిపెట్టిరి, ఏమి సేతున్=ఏమి చేయుదును.

తా. ఓయింతీ! నా నిశ్చితార్థమునకై వరునియింటివారు రాఁగా త్రోవలో బ్రాహ్మణు లిరువురు ఎదురుపడిరి. వరునిఁ దెచ్చెడువేళ మార్గములో పూర్ణకుంభంబులు ఎదురుపడెను. మంగళసూత్ర ధారణసమయంబున బహుశుభంబుగా గౌళిపలికెను. నా గృహప్రవేశ సమయంబున, గరుడపక్షి శుభముగా పాల దీర్చెను. ఇట్లు శకునదేవతలందఱును నాకు పరమశత్రువులగుచును ఇట్టి దయావిహీనునకుం గూర్చిరి. ఏమిచేయుదును.

సీ. విరులేల? ముత్యాలసరులేల? ప్రాణేశుఁ
డూఱక ననుఁబాసిౝయున్నయపుడు

వగ లేల? మెయినిండు సొనగ లేల? విభుఁ డిట్లు
దూరీకరించి హా! తొలఁగినపుడు
గృహ మేల? మీయనుగ్రహ మేల? నానాథుఁ
డలుక నెమ్మదిలోన నిలిపి నపుడు
జగ్గేల? మేనికి నిగ్గేల? సరసుండు
మించుగా మదిమత్సరించునపుడు.

గీ. మగఁడు చూడని సొగ సేల? మగువలకును?
బురుషుఁ డెడఁబాయ కేలు టే భూషణంబు॥ చెలియ॥ 36

టీ. ప్రాణేశుఁడు = జీవితేశుఁడు, ఊటక; ననుబాసియున్న యపుడు = నన్నెడఁబాసియుండఁగా, విరులేల = పూలతోడి పనియేమి? ముత్యాలసరులేల = ముత్యాలహారము లేల? విభుఁడు = జీవితేశుఁడు, ఇట్లు దూరీకరించి = ఇట్లు తొలఁగించి, హా = అయ్యో! తొలగినపుడు = పాసినవేళ, వగలేల = అందములేల? మెయినిండు నగలు ఏల = శరీరమునిండుగ భూషణములేల? నానాథుఁడు = నాప్రియుఁడు, నెమ్మదిలోనన్ = మనస్సులో, అలుకనిలిపినపుడు = కోపము ంచినపుడు, గృహ మేల = ఇల్లేల? మీ యనుగ్రహ మేల = మీ దయలు ఏల? సరసుండు = రసికుండు, మించుగాన్ = అధికముగా; మదిన్ మత్సరించునపుడు = మనస్సునందు క్రోధించునప్పుడు, జగ్గేల = కాంతులేల? మేనికిన్ = శరీరమునకు, నిగ్గేల = నీటులేల? మగువలకును = స్త్రీలకు, మగఁడుచూడని సొగసు ఏల = పెనిమిటి చూడంగలేని అందములేల? పురుషుఁడు = మగఁడు, ఎడఁబాయక ఏలుటే = వదలక పాలించుటే, భూషణంబు = సొమ్ము.

తా. పెనిమిటి తోడఁబాసియున్న కాలములయందు, విరులును, ముత్యాలసరులను, గృహమును, మీబోటిబోఁటుల యనుగ్రహములును, శీవులును, సొమ్ములును, జగ్గులును నిగ్గులును ఎందుకు? మగనికి కాని సొగసులతో ప్రయోజనం ఏమి? పురుషుఁడు జతకూడియుండుటే గదా స్త్రీలకు భూషణము.

సీ. విభుఁడు దగ్గఱ లేని వెలఁదివాగ్చతురిమ
పాడింట చిలుకలు పల్కినట్లు
పతి నెడఁబాసిన భామశృంగారంబు
రాజబింబము లేని రాత్రియట్లు
ప్రాణేశుఁ డెడసిన పడఁతి యొయారంబు
లడవికోనల నెమి ళ్లాడినట్లు
పురుషుఁ డొల్లనియట్టి పొలఁతియావన మెల్ల
ముష్టిచెట్టది పూలఁ బూసినట్లు
గీ. ఈవిధం బాయె నాబ్రదు కేమి సేతు
నేలపుట్టించె నజుఁడు న న్నిట్టు లేచ॥ చెలియ॥ 37

టీ. విభుఁడు దగ్గఱలేని వెలఁది=పతి కెడఁబాసిన కాంతయొక్క, వాగ్చతురిమ=మాటలచాతుర్యము, పాడింటచిల్కలు పల్కినట్లు=పాడుపడిన యింటియందు చిలుకలు మాటలాడినట్లు; పతి నెడఁబాసిన భామ = పెనిమిటినుండి తొలఁగిన స్త్రీయొక్క, శృంగారంబు=అందము, రాజబింబము లేని రాత్రియట్లు=చంద్రబింబములేని రాత్రివలె, ప్రాణేశుఁ డెడసిన పడఁతి=జీవితేశుఁ డెడఁబాసిన స్త్రీయొక్క, ఒయ్యారంబు=నీటు, అడవికోనల నెమిళ్లాడినట్లు=అడవులయందలి కోనలలో నెమిళ్లు నర్తించినట్లు, పురుషుఁ డొల్లని యట్టిపొలఁతి=కాంతుఁడు ప్రేమింపనట్టి స్త్రీయొక్క, జవ్వనమెల్లన్=యౌవనమంతయును, ముష్టిచెట్టు=విషముష్టి, అదిపూలన్ పూసినట్లు=అదిపుష్పించునట్లు, నాబ్రదుకు=నా జీవితము, ఈ విధంబుఆయెన్=ఇట్లు వ్యర్థమాయెను, ఏమిసేతున్ = ఏమిచేయుదును, ననున్, ఇట్లుఏచన్=ఇట్లు మోసగించుటలకై, అజుఁడేల పుట్టించెన్ = బ్రహ్మయేల సృష్టించెనో?

తా. కాంతుఁడు జోడువీడిన వెనుక వెలఁదికి గలవాఙ్మంజిమ పాడుపడిన యిండ్లయందలి శుకముల యాలాపములవలెను, దాని శృంగారంబు చంద్రుఁడు లేని రాత్రివలెను, దాని యొయారము యడవికోనలయందలి మయూరముల

వలెను. దానిజవ్వనలక్ష్మి, పుష్పించిన విషముష్టి చెట్టువలెను వ్యర్థములగును. నా బ్రదుకు దుద కిట్టులాయెను. ఏమిచేయుదును? నన్నీ యాఱడిపాటు కనియే బ్రహ్మ సృజించినాఁడేమో ?

సీ॥ తిలకమ్ముఁ జక్కఁగా । దిద్దనేరనివాఁడు
జగ్గుగా సొగసులు । సలుప నేర్చె.
నతివలయెదుట మా।టాడనేరనివాఁడు
చదురులాడఁగ నేఁడు।సాహసించె
నేప్రొద్దుఁ గోపించి । యెఱుఁగ నేరనివాఁడు
మిన్నక నలుకల।మెలఁగ నేర్చె
లీలనొంటిగఁ బవ్వ।ళింపనేరనివాఁడు
తెగువమై రేలొంటఁ । దిఱుఁగ నేర్చె
గీ॥ నెవతె నేర్పెనొగా! చెల్ల! । యేమి సేతు?
మందు తలకెక్కి యలదాని।మరగినాఁడు॥ చెలియ॥ 38

టి. తిలకమ్మున్ = బొట్టును, చక్కఁగా దిద్దనేరనివాఁడు=చక్కఁగాఁ బెట్టుకొనుటకు రానివాఁడు, జగ్గుగాన్ = అందముగా, సొగసులుసలుపన్ = సింగారించుకొనుటలకు, నేర్చె= నేర్చుకొనెను. అతివలయెదుటన్ = స్త్రీలకెదుట, మాటాడ నేరనివాఁడు, నేఁడు, చదురులాడఁగన్ = చతురోక్తులను పలుకుటకు, సాహసించెను= తెగించెను, యేప్రొద్దున్ = ఎప్పటికిని, కోపించి యెఱుఁగ నేరనివాఁడు= అలుగుటకు తెలియనివాఁడు, మిన్నక = ఊఱక, అలుకలన్ మెలఁగ నేర్చెన్ = కోపించుటలయందే యలవాటుపడెను, లీలన్ = విలాసముగా, ఒంటిగన్ = ఒంటరిగా, పవ్వళింప నేరనివాఁడు= పరుండుటకుఁ గానివాఁడు, తెగువమైన్ = సాహసముతో, రేలు= రాత్రులు, ఒంటన్ = ఒంటరిపాటుగా, తిఱుగన్ = సంచరించుటకు, నేర్చెన్ = గ్రహించెను, చెల్ల= ఆశ్చర్యము, ఎవతె నేర్పెనొగా= ఎవతె కఱపినదో? ఏమి సేతున్ = ఏమి చేయుదును, మందు= దాని పెట్టిన వశీకరణౌషధము, తలకెక్కి= తలవఱకును వ్యాపించి, అలదానిన్ మరగినాఁడు = దానితోడనే యలవాటుపడినాఁడు.

తా. తిలకము దన నొసటియందు నేరుగా పెట్టుకొనుటకు రానివాఁడు, వింతశృంగారంబులను నేర్చినాఁడు. స్త్రీలయెదుట తలయెత్తి మాటలాడ నేరని వాఁడు చదురులు పలుకుటకుఁ దెగించినాఁడు. కోపమన్నది యెన్నఁడును దెలియనివాఁడు ఊటక యలుకలతోడనే ప్రొద్దులు గడుప నేర్చినాఁడు. ఒంటరిగా పరుండుటకు కానివాఁడు రేలు ఒంటరిపాటున సంచరించుటయందు గడిదీఱినాఁడు, ఆహా ! ఎవతె నేర్పెనో యిట్టి విపరీతచర్యలను? దానిమందులు తలకెక్కటంజేసి దానినే మరగియుండువాఁడు.

సీ॥ నినుఁబాయ లేనని ♦ నెఱబాసలిచ్చిన
మాటల నానాఁడె ♦ మఱచినావొ?
నీపుక్కిటివిడెంబు ♦ నెలఁత! యిమ్మనివేఁడు
మచ్చిక నానాఁడె ♦ మఱచినావొ?
యలరేయి నుపరతిఁ ♦ గలసినిన్నెచ్చిన
మరుకేళి యానాఁడె ♦ మఱచినావొ?
యలిఁగిన ననుఁబల్కు ♦ మంచుఁ బల్లఱుమ్రొక్కు
మరుల నీ వానాఁడె ♦ మఱచినావొ?
గీ॥ యనుచు నేఁ బల్కినట్లుగా ♦ నతనిమనసు
తాఁక నాడుము నాకైన ♦ దానవీవు॥ చెలియ॥ 39

టీ. నినుబాయఁగ్ లేను=నినువదలఁజాలను, అని, నెఱబాసలిచ్చినమాటలగ్ = నిండునమ్మకములను ఇచ్చిన సంగతులను, ఆనాడె మఱచినావొ=ఆదిన మేమఱచి పోతివో? నెలఁత=ఓ ప్రియురాలా ! నీ పుక్కిటివిడెంబుగ్ =నీ నోటితమ్ములమును, ఇమ్ము అని వేఁడుమచ్చికల్ =ఇమ్ము అని ప్రార్థించుస్నేహములను, ఆనాడె మఱచినావొ=ఆదిన మే విస్మరించితివో? అలరేయిగ్ =ఆ రాత్రియందు, ఉపరతిని=పురుషాయితకేళియందు, కలిసి=నిన్ను చేరి, ఎచ్చినమరుకేళిగ్ = నిన్ను మీఱిన రతిక్రీడలను, ఆనాఁడె మఱచినావొ=ఆదిన మే మఱచితివో? అలిగినగ్ =పొలియల్కలుగొన్న, నన్నుకగ్ పల్కుమంచుగ్ =నన్నుమాటలాడుమని,

పల్లవి మ్రొక్కుమనుచుఁ=పలుతడవలకు మ్రొక్కులు పెట్టుచుండినమోహ మును, నీవు ఆనాఁడె మఱచినావో=నీ వాదినమే మఱచితివో? అనుచుఁ=ఇట్లు చెప్పుచు, నేనుపల్కినట్లుగాఁ = నేను చెప్పినవిధముగా, అతనిమనసు తాఁకఁ = అతనిచిత్తమునకు వచ్చునట్లు, ఆడుము = పలుకుము, ఈవు నాకైనదానవు= నీవు నా హితురాలవు గదా?

తా. ఓ కామినీమణీ! నిన్నెన్నటికిని ఎడఁబాయను అనిచెప్పినమాటలను ఆనాఁడే మఱచితివా? ఓ ప్రియురాలా! నీ పుక్కిటివిడెంబును ఇయ్యంగదే యని వేఁడికొన్నవైఖరులును, ఆరేయిపురుషాయితకేళిని నిన్ను కూడియిచ్చిన ముచ్చటలను, నేను కోపగించిన పడిమ్రొక్కి ప్రసన్నవు గమ్మని వేఁడికొన్నవిధ ములను అన్నిటిని అదినమే మఱచిపోతివో అని నామాటలుగా నతనికి తాఁకు నట్లు చెప్పవమ్మ నీవేగద నాకైనదానవు.

సీ॥ ముదమున సామికి § మ్రొక్కితి నని దెల్పి
శీఘ్రంబు నాయిల్లు § సేరమనవె,
యిందేవసింప నీ § కిచ్ఛ లేకుండెనా
నెలకైన నాయింట § నిలువుమనవె,
నిలువఁగానతనికి § నెనరు లేకుండెనా
యీరేయిరతిసుఖం § బీయమనవె,
రతిసుఖం బిడుటకా § రామకు వెఱచునా
యింపుగా నను గౌఁగి § లింపు మనవె,
గీ॥ యంతమాత్రంబునను భయం § బందె నేని,
యాననమునైనఁ జూపిపొ § మ్మనవె నేఁడు॥ చెలియ॥ 40

టీ. సామికిఁ =నా ప్రియునికి, ముదమునఁ మ్రొక్కితినని దెల్పి=సంతో షముతో నమస్కరించితిని అని దెలియంజేసి, శీఘ్రంబు=త్వరగా, నా యిల్లు చేరుము అనవె=నాయింటిని చేరుమని చెప్పవే, ఇందేవసింపఁ = నాయింటి యందే యుండుటకు, ఇచ్ఛ లేకుండెనా=ఇష్టపడకుంటివా? నెలకైనఁ నా

యింట నిలువుమనవె=ఒక నెల రోజులకైనను ఇందువసించి యుండుమనుము, అతనికిన్=కాంతునికి, నిలువంగాన్=ఇందువసించుటకు, నెనరు లేకుండెనా=కృతజ్ఞత లేకపోయెనా? ఈ రేయిరతిసుఖం బీయమనవె=ఈ రాత్రికయినను క్రీడించి పొమ్మనవె. రతిసుఖంబిడుటకున్=క్రీడించుటకు, ఆరామకు వెఱచెనా=ఆకాంతకు భయపడెనా, ఇంపుగాన్=ఇష్టముతో, నన్ను కౌఁగిలించుకొనుము, అనవె, అంతమాత్రంబునకున్ = ఈస్వల్పకృత్యమునకును, భయంబందెనేని = భయపడినాఁడో, నేఁడు=నేఁటికి, ఆననమునైనన్=ముఖమునైనను, చూపి పొమ్మనవె= చూపిపొమ్మని అతనికి చెప్పుమా.

తా॥ ఓ చెలియా! నా కాంతుని నమస్కరించితినని యతనికి నామాటలుగా ఇట్లు చెప్పుము. "ఓ నాయకుఁడా శీఘ్రముగా నాయింటిని చేరుము. ఇచ్చట నే యుండుటకు నీ కిచ్చ లేకుండెనా? నెలరోజులకైన నిలువుము చాలును; నిలుచుట కిష్టము లేకుండెనా? యీ రేయికైనను ఇందువసించి రతిసుఖంబిచ్చి పొమ్ము; ఆరామకు భయపడి రతిసుఖమీయ నొల్లవేని, నీయాలింగనమునందుఁ దేల్చి సౌఖ్యమిమ్ము అంతకునును నీకు దానిభయము మిక్కుటమాయెనో మోమునైనను చూపిపొమ్ము" అని చెప్పవే.

సీ॥ బాలప్రాయమునాఁడు – పతియని యెఱుఁగక
యూఱక కొన్నినాళ్లుంటినమ్మ,
పూపప్రాయపువేళఁ – బురుషుచెంతకురాక
వెఱపుచేఁ గొన్నినాళ్ల జరిగెనమ్మ,
కౌమరప్రాయంబునఁ – గోర్కులు దాఁచిన
యంగునఁ గొన్ని నాళ్ల జేఁగెనమ్మ,
గబ్బిప్రాయంబున – ఘనుఁడు నాయెడనల్గ
నెనయక గొన్నినాళ్లేగెనమ్మ,
గీ॥ యబ్బురంబైన జవ్వనం – బడవిఁగాయు
నట్టివెన్నెల వైఖరి – వ్యర్థమయ్యె॥ చెలియ॥ 41

టీ. బాల్యప్రాయమునాఁడు = పదునాలు సంవత్సరముల యీడునందు, పతియని యెఱుఁగక = మగఁడను జ్ఞానములేక (మగనివలన నిట్టిసుఖము లుదయించు నను తెలివిలేక) ఉంటిఁ గొన్ని నాళ్లు = ఏమియునులేక కొన్ని దినములు, ఉంటి నమ్మ, పూపప్రాయపువేళ౯ = పుష్పిణియైన కాలములందు, పురుషు చెంతకు౯ రాక = మగనిని దగ్గఱింపకయే, వెఱపుచే౯ = భయముచేత, కొన్ని నాళ్లు అఁటె గె నమ్మ = కొన్నిరోజులు గడిచెను గదమ్మ, కొమరు ప్రాయంబున౯ = అందమయిన యౌవనమునందు, కోర్కులుదాఁచినయంగున౯ = కోరికలను మనస్సుపీడక దాఁచి పెట్టుకొను పద్ధతియందు, కొన్ని నాళ్లు అఁటె గెనమ్మ = కొన్నిరోజులు గడిచె నమ్మ, గబ్బిప్రాయంబున౯ = ప్రౌఢనాయికత్వమును జెందినప్పుడు, ఘనుఁడు నాయెడ౯ అలుగ౯ = ప్రియుఁడు నాయెడఁ గోపింపఁగా, ఎనయక = చేరక, కొన్ని నాళ్లు ఏఁగెనమ్మ = కొన్ని దివసములు జరిగెను, అబ్బురంబయిన యౌవ నంబు = అపురూపమైనజవ్వనము, అడవిఁగాయు వెన్నెలవైఖరి౯ = అడవిని గాసెడి చంద్రికవలె; వ్యర్థమాయెను.

తా. ఈపద్యమునందు నాయిక తనముగ్ధామధ్యప్రగల్భ నాయికాస్థితులను గూర్చి చెప్పుకొనుచున్నది. ఓసఖీ నేనుముగ్ధ నాయికగా ఉండునప్పుడు పతి వలనిప్రయోజన మిట్టిదను జ్ఞానములేక కొన్ని నాళ్లుగడిపితిని; మధ్యనాయి కనైన వేళలందు, కోర్కులు వెలిపుచ్చుటకు సిగ్గునొంది కొన్ని దినంబులు వ్యర్థ ములుగాఁ గడపితిని. ప్రగల్భనాయికనగు నీవేళలందు నతనితోఁ జియలుకలతోఁ డనే దినములు నడచుచున్నవి. హా! చెలీ నాయౌవనము అడవిని ఆశ్రయించి న చంద్రికవలె నాశరీరమును ఆశ్రయించి వ్యర్థమయ్యెను.

సీ॥ బలిమిని నేనయై । పలుకరించుటగాని
యాదరంబున మాటలాడ నెఱుఁగ,
ముందుగా నేనట్లు । ముద్దిడుటేగాని
యతఁడు ప్రేమను మోవి । యాను టెఱుఁగ,
కదిసినే నటుగ్రుచ్చి । కౌఁగిలించుటెగాని
చేపట్టియక్కునఁ । జేర్చు టెఱుఁగఁ,

గ్రక్కున నేనటుకే కదిసికూడుటెగాని
కోరియంగజుకేళిఁ గూడుటెఱుఁగ,
గీ. పతులుసతులును దమప్రాణపదములట్లు,
చూచికొనియుంట కేనోముకేనోఁచికొనిరొ॥ చెలియ॥ 42

టీ. బలిమిని=బలాత్కరించి, నేనయె పలుకరించుటగాని= నేనుగా మాటలాడించుటేగాని, (విభుఁడు) ఆదరంబునన్=ఆదరించి, మాటలాడన్=మాటలాడి యుండుటను, ఎఱుఁగను, ముందుగాన్=ముందుకొని, నేనుముద్దిడుటేగాన్= నేనుగా ముద్దులు పెట్టుకొనుటేగాని, అతఁడు, ప్రేమను, మోవియానుటన్ ఎఱుఁగన్=అధరామృతపానమును చేయుటను దెలియను, కదిసి=దగ్గఱించి, నేనయికౌఁగిలించుటెగాని= నేనుగా ఆలింగనము చేసికొనుటేగాని, చేపట్టి=చేరఁదీసి (విభుఁడు) అక్కునన్ చేర్చుట=ఱొమ్మునచేర్చుకొనుట, ఎఱుఁగన్=తెలియను, నేనయి=నేనుగా, కదిసి=చేరి, కూడుటెగాని=రతినల్పుటెగాని, కోరి అంగజుకేళిన్=మన్మథక్రీడలను, కూడుట ఎఱుఁగన్=కలియుటను దెలియను, పతులు సతులును=(ప్రపంచమునందలి) భర్తలును భార్యలును, తమ ప్రాణపదములుగా భావించిమెలఁగుటకు, ఏనోమునోఁచికొనిరొ = ఎట్టి యుత్తమమైన వ్రతమును చేసికొనిరో.

తా. అమ్మా! నేను బలాత్కరించి మాటలాడుటేగాని యతఁడుగా నాతో మాట్లాడుటను దెలియను, నేనుగా అతనిముద్దిడు కొనుటయేగాని, యతఁడు నా మోవిని ఆనుటను ఎఱుఁగను, నేనుగా అతని కౌఁగలించుకొందునుగాని చేరఁదీసి యతఁడు ఱొమ్మునఁజేర్చిన సుదినమును గనియుండను. నేనయిరతిక్రీడ నలుపుటేగాని యతనిముందుకొనిన క్రీడలనెఱుఁగను. భామరో! ప్రాణపదములుగా నున్న భార్యాభర్తలు తొల్లిటిజన్మములం దేనోములు నోఁచికొనియుందురో ఎఱుఁగను.

సీ॥ ఇటుమల్లినను గాఁగిలింతునో నేనని
యవ్వాలిమోముగాఁ బవ్వళించుఁ

ప్రేమతో ముద్దీడఁ బెట్టుదునో యని
మాయనిద్దురఁ గొని మలయుచుండు,
బలిమిగా రతికి నేఁ బైకొందునో యని
యెదశయ్య నొయ్యనఁ గదియఁ జేయు
నరసి యేనేమాట లాడుదునో యని
బిగి దుప్పటిముసుంగుఁ బెట్టికొనును,
గీ॥ దానిపై మోహమున నన్నుఁ దలఁపఁడనుచుఁ
దెలియలేనైతి కపటంబు తేఁటపడియె॥ చెలియ॥ 43

టీ. ఇటుమల్లినక్=ఇట్లు దిఱుగఁగా, నేను కౌఁగిలింతునోయని=నేను ఆలింగనము చేసికొందు నేమోయను నూహచేత, అవ్వలిమోముగాక్ పవ్వళించుక్=పొర్లి పండుకొనును. ప్రేమతో, ముద్దుక్, ఏడ పెట్టుదునోయను శంకచేత, మాయనిద్దురక్ కొని=కపటపు నిద్రనుపూని, మలయుచుండుక్=ఉండును. బలిమిగాక్=బలాత్కరించి, నేను రతికి పైఁగొందునో అని=ఉపరతికి మొదలుపెట్టుదునోయని, చయ్యనక్=శీఘ్రముగా, శయ్యక్=పడుకయందు, ఎదక్ కదియఁజేయుక్=బోరగిల పండుకొనును. అరసి=తెలిసి, ఏమాట లాడుదునోయని=ఏపలుకులనుగూర్చి పలుకరింతునోయని, బిగిదుప్పటి ముసుంగుక్=దుప్పటముతో గట్టి ముసుఁగును, పెట్టికొనును=వైచికొనును. (అట్టి కాలములయందు) దానిపై మోహమునక్=దానిమీఁది ప్రేమాతిశయముతో, నన్నుఁ దలఁపఁడు అనుచుక్=నన్నుఁ గోరఁడు అని, తెలియలేనైతిక్=గ్రహియింపనైతిని, కపటంబు తేఁటపడియెక్=మోసము దెలియవచ్చెను.

తా. ఇట్లు తిరిగిన నన్నుఁ గౌఁగిలించునోయని, ఆవలి ముఖముతోఁ బవ్వళించును. ప్రేమతో ముద్దీడ పెట్టుకొందునోయని మాయ నిద్దురలను దీయును బలాత్కరించి యెక్కడ పైకొందునోయని, బోరగిల పరుండును. నేను ఏమాట లాడుదునోయను శంకచేత దుప్పటిముసుంగు బిగిగా పెట్టుకొనును. దానివలపువలని యతిశయముచే నిట్లు చేయుచున్నాఁడని యా కాలములందుఁ దెలియకపోతిని.

సీ॥ వడలుపాయసముల కై వ్వారి సేయింతుగా
విభుఁడు ప్రేమనుగారవించెనేని,
బండ్లపైఁ జక్కెరఁ బంచి పెట్టింతుగా
ప్రియుఁడు రమ్మని పేరఁ బిలిచెనేని,
గోపురంబులఁ బైఁడి కుండలెత్తింతుగా
గబ్బిగుబ్బలఁ గ్రుమ్మఁ గలిగెనేని,
తిరుపావడఘటించి తిరునాళ్లు సేతుగా
కరుణఁ బ్రాణేశుండు కలసెనేని,

గీ॥ యిన్ని దేవతలను వేఁడుకొన్నయపుడె
తలఁపు లొనఁగూడకుండునా ధవళనయన॥ చెలియ॥ 44

టీ. ధవళనయన=ఓధవళాక్షి ! విభుఁడు=నాయకుడు, ప్రేమనుగారవించెనేని=ప్రీతితో గౌరవించెనా ? (దేవునకు) వడలు పాయసములు, అవ్వారిచేయింతుఁగా=అధికముగా చేయించుదును. ప్రియుఁడు, రమ్మఅని, పేరఁ బిలిచెనేని=పేరు పెట్టి పిలిచినయెడల, బండ్లపైఁ=బండ్లమీఁద వేసి, చక్కెర పంచి పెట్టింతుగా; గబ్బి గుబ్బలఁ=మదించిన స్తనములను, క్రుమ్మఁ గలిగెనేని=విభుని) తాఁమ్మునందు క్రుమ్మునంతటి వైభవము గలిగినయెడల, గోపురంబులఁ=గోపురములమీఁద, పైఁడికుండలెత్తింతుఁ=బంగారు కలశములను పెట్టింతును. తిరుపావడముఁ ఘటించి=నాలుకకోసికొను ప్రార్థనను చేసి, కరుణఁ, ప్రాణేశుండు, కలిసెనేని=కూడెనేని, తిరునాళ్లచేతు = ఉత్సవముచేయింతునుగదా! ఇన్ని దేవతలకుఁ=ఇందఱు దేవతలకు, వేఁడుకొన్నయప్పుడె=ప్రార్థించుకొన్నపుడే, తలంపులు ఒనగూడకుండునా=కోర్కులు కొనసాగకుండునా ?

తా. చెలియరో? నానాయకుఁడు, నన్ను గారవించి నట్లయిన వడలుపాయసములు ఘటింతును, నన్ను పేరు పెట్టి పిలిచెనేని బండ్లమీఁదఁ జక్కెరను వేయించి పంచి పెట్టింతును; నాయెద నతని యురమునఁ జేర్పఁ గలిగినప్పుడు బంగారుకలశములను గోపురోపరిభాగమ్మునందు చేర్పింతును. నన్నురతులగూడెనో తిరు

పావడము వేయింతును, ఇట్లు దేవతలకు ప్రార్థనలనుజేసి కొన్నప్పుడే, నాకో ర్కెలు కొనసాగకపోవునా?

సీ॥ విరులుచుట్టఁగఁబోఁగ వేఁగదిగ్గునలేచు
మడుపు లీఁబోవంగ మాఱుమసలుఁ,
బదములొత్తఁగఁబోఁగఁ బదములువినుమను
వడిగఁబైకొనఁబోఁగ వగలుచేయు,
ముద్దిడంగనుబోఁగ ముచ్చటలాడించు
మోవి నానఁగఁబోఁగ ముసుఁగు వెట్టు,
గాఁగిలించఁగఁబోఁగఁ గలకలమ్మనినవ్వు
కదిసి కేళికిఁబోఁగఁ గదలు సెప్పు,
గీ॥ మమతలలదానిపై నున్న మర్మమపుడు
దెలియలేనైతి మర్మంబు దేఁటవడియె॥ చెలియ॥ 45

టీ. విరులుచుట్టఁగఁ బోఁగన్ = పూలుచుట్టుటకుఁ బోవఁగా, వేఁగన్ = శీఘ్రమున, దిగ్గునలేచున్ = తటాలుమనిలేచును, మడుపులీపోవంగన్ = ఆకుమడుపు లీయఁబోఁగా, మాఱుమసలున్, పదములొత్తఁగఁబోఁగన్ = పాదములు ఒత్తుటకయిపోవఁగా, పదములు వినుమనున్ = పాటలు వినుమని పాడసాగును, వడిగన్ = వేగముగా, పైకొనన్ పోఁగన్ = రతికెలయింపఁగా, వగలుచేయున్ = రీతులనుపన్నును, ముద్దిడంగనుపోఁగన్ = ముద్దుపెట్టికొనుటకయిపోవఁగా, ముచ్చటాడించున్ = మాటలకుదిగును, మోవిన్ ఆనఁగన్ పోఁగన్ = అధరపానమునకయి పోవఁగా ముసుఁగు పెట్టున్ = ముసుఁగిడుకొనును. కాఁగిలించఁగన్ పోఁగన్ = ఆలింగనము చేసికొనుటకయిపోవఁగా, కలకలమనినవ్వున్ = పకపకమనినవ్వును. కదిసికేళికిన్ పోఁగన్ = చేరిక్రీడింపఁబోవఁగా, కదలుచెప్పున్ = పురాణములను విప్పును. మమతలు=ప్రేమలు, అలదానిపైనున్న మర్మము=దానిపైయుంచి యుండినగుట్టును, అప్పుడు ఎఱుఁగనైతిన్ = అపుడు తెలియలేనైతిని? తేఁటపడియెన్ = తెలియవచ్చెను.

తా. పూలుచుట్టుటకుఁబోయిన యెడలఁ ద్వరగాలేచును, మడుపులిచ్చుటకుఁబోవఁగా మాఱుమసలును; పాదములొత్తుట కయిపోవఁగా, పదములుపాడును; పైకొనపోతినోవగలుచూపును. ముద్దిడుటకై పోవఁగ ముచ్చటలంకురించును; అధరమానుటకుపోవుచో ముసుఁగుపెట్టికొనును. ఆలింగనము చేయుటకయిపోవఁగా పకపకనవ్వును, ఇట్లుమమతలు దానిపైనుంచియుండిన మర్మము అప్పుడే తెలియనైతిని. ఇప్పుడు చక్కఁగాఁదెలియవచ్చెను.

సీ॥ వనితరోయీరేయి ✱ వల్లభుఁ డిటువచ్చి
లెమ్మని నిద్దుర ✱ లేపినట్లు,
లేపిన ముసుఁగిడి ✱ లేవక బిగువున
నలిగియేఁబొమ్మని ✱ యన్నయట్లు,
అన్నంతనామోవి ✱ యానికాఁగిటఁజేర్చి
మనవిగా నను బతిమాలినట్లు,
బతిమాలఁగా బ్రేమ ✱ పట్టఁజాలక యప్డు
గ్రక్కునఁ బతితోడఁ ✱ గలసినట్లు,
గీ॥ మాయ కలఁగని బలుజాలి ✱ మలసినాను
ఇట్లురానేలరాకన ✱ న్నేమివాఁడు॥ చెలియ॥ 46

టీ. వనితరో=ఓచెలీ! ఈరేయిన్=ఈరాత్రి, వల్లభుఁడు=పెనిమిటి, ఇటువచ్చి, లెమ్మనినిద్దుర లేపినట్లు=లెమ్మనినిద్రనుండి లేపినట్లును, లేపినన్=అట్లు లేపఁగా, ముసుఁగిడి=ముసుఁగువెట్టుకొని, లేవక, బిగువునన్=గర్వముతో, అలిగి=అలుకనుగొని, ఏనుపొమ్మనియన్నట్లు=పొమ్మనిచెప్పినట్లును, అన్నంతన్=అట్లు నేను జెప్పినతోడనే, నామోవిన్ ఆని=నాయధరమును గ్రోలి, కాఁగిటన్ జేర్చి=కౌఁగిటఁజేర్చి, మనవిగాన్=విన్నపముగా, ననుబతిమాలినట్లు=నన్ను వేఁడుకొన్నట్లు; బతిమాలఁగాన్=అట్లు వేఁడుకొనఁగా, అప్డు ప్రేమన్ పట్టఁజాలక=అప్పుడు ప్రీతినినిలుపఁజాలక, గ్రక్కునన్ పతితోడన్ కలసినట్లు=శీఘ్రముగా విభునితోఁజేరినట్లు, మాయకలన్ గని=మోసపుఁగలనుకని, బలుజాలిమలసినాను=మి

గులజాలి చెందితిని. రాకనన్నే చువాఁడు = తానురాకయేనన్ను మోసగించువాఁడు, ఇట్లురానేల=ఇట్లేలరావలయును.

తా. ఓసఖీ! విభుఁడు ఈరాత్రికివచ్చినట్లును, వచ్చినిదురలేపినట్లును, నేనందులకు బిగువుచెలుపలేక యతని పొమ్మన్నట్లును అంతనతఁడు నన్ను అలొమ్మునఁజేర్చి మోవియానినట్లును అప్పుడేను ప్రేమను పట్టియుంచఁజాలక నానాథునితోఁగూడినట్లును కలగంటిని. అంతనది కలయని తెలిసి జాలిగొంటిని. తానురాకయే నన్ను హింసించువాఁడేల యిట్లురావలయును?

సీ॥ చల్లవెన్నెలఁగాయు । చంద్రబింబంబది
ప్రళయాగ్నినిభమయ్యెఁ । బాపమేమొ,
హాయిగాఁ ప్రాణుల । కనువైన తెమ్మెఱ
వేఁడివీఁపులవీఁచు । విధమదేమొ,
రమణీయశుకపికా । రావము ల్చెవులకు
వినవింపుగానట్టి । విధమదేమొ,
సరసమౌసంగీత । సాహిత్యములఁబ్రీతి
నెక్కొనకుండెడు । నిక్కమేమొ,
గీ॥ వింతలెల్లను నానాట । విస్తరించె
నొంటి నీరేయి విభుఁబాసి । యుండుటెట్లు॥ చెలియ॥ 47

టీ. చల్లవెన్నెలఁ గాయుచంద్రబింబంబు=చల్లఁగావెన్నెలలు వెదచల్లునట్టి చంద్రబింబము. అది ప్రళయాగ్నినిభమయ్యెన్ =ప్రళయకాలపు అగ్నినిబోలియున్నది. ఏమొపాపము= నేనుచేసిన పాపకార్యంబునునది యెట్టిదో? హాయిగాన్ = నెమ్మదిగా, ప్రాణులకున్ =జీవులకు, అనువైన తెమ్మెర=అనుకూలించిన మందమారుతము వేఁడివీఁపులన్ వీచువిధము= సెగలతో వీచునట్టివిధము, అదేమొ=అది యెట్టిదో? రమణీయ=మనోజ్ఞమయిన, శుకపికారావముల్ =చిలుకలయొక్కయు, కోకిలములయొక్కయు కూజితములు. చెవులకున్, వినవింపుగానట్టి విధముఅదేమొ=వినుటకిష్టపడని రీతియదేమో. సరసమౌసంగీతసాహిత్య

ములన్ = రసవంతములయిన కవిత్వగానములయందలి, ప్రీతినెక్కొన కుండెడు నిక్కముఏమొ = ఇష్టముకుదురనట్టి గుట్టుఎట్టిదో? వింతలెల్లన్ = అన్నివిచిత్రములును, నానాటన్ విస్తరించెను = దినదినమునకు అధికమయ్యెను. విభున్ బాసి = కాంతునివిడఁబాసి, ఈరేయి = ఈరాత్రి, ఒంటియుండుటెట్లు = ఎవ్విధముగా ఒంటరిగానుందును?

తా. జనులకు చల్లఁదనమిచ్చు చంద్రబింబము వేఁడివెన్నెలలను గాయుచున్నది. చల్లని మెల్లని మలయానిలము వేఁడిసెగలను వెదచల్లెడిని. మనోజ్ఞంబులైన శుకపికంబుల కూజితంబులు వినసొంపులు గలిగింపవు. సరసమైన సంగీతసాహిత్యములయందు బుద్ధి చెల్లదు, ఏమోదినదినమునకు వింతలేర్పడుచున్నవి. యీరేయి యెట్లు గడపుదానను.

సీ॥ ఈరేయి ప్రాణేశుఁ ✻ డిందువచ్చునటంచుఁ
బల్కఁగల్గునటేమొ ✻ భామలార,
గబ్బిగుబ్బలనెదఁ ✻ గదిమినే నదుముచుఁ
బవళింపఁగలనటే ✻ పడఁతులార,
కుసుమాస్త్రకేళిని ✻ గొసరినాతమిఁదీఱఁ
గలయఁగల్గునటేమొ ✻ కాంతలార,
వలరాజుతోఁ బోరు ✻ వదలినిర్భయముగా
నుండఁగల్గునటేమొ ✻ యువిదలార,
గీ॥ విభునిరాకకు వేఁచి నే ✻ విసివినాను
గడియ యేఁడుగ నెన్నాళ్లు ✻ గడుపుదాన॥ చెలియ॥ 48

టీ. భామలార = స్త్రీలారా! ప్రాణేశుఁడు = విభుండు, ఈరేయి = ఈరాత్రికి, ఇందువచ్చునటంచున్ = ఇచ్చటికివచ్చునని, చెప్పఁగల్గునటేమొ = చెప్పుటకు అగునేమొ చెప్పుఁడీ, పడఁతులార = స్త్రీలారా! గబ్బిగుబ్బలన్ = నావక్షోరుహములను, ఎదన్ = (విభుని) హృదయమ్మున, నేనుగదిమి యదుముచున్ = నేను చేర్చియదుముచును, పవళింపఁ గలనటే = పరుండజాలియుందునో? కాంతలార = చెలికత్తెలారా?

కుసుమాస్త్రకేళిని=మన్మథక్రీడలయందు, నాతమితీఱన్ =నాతహతహలు దీఱునట్లు, కొసరి=మఱిమఱివేఁడి, కలయఁగల్గునఁటే మొ= చేరఁగలుగునా? ఉవిదలార=యువతీమణులార? వలరాజుతోఁ బోరువదలి=మన్మథునితోడి పోరాటమునువదలి, నిర్భయముగాన్ =భయములేక, ఉండఁగల్గునటే మొ=ఉండుటకగునేమో? విభునిరాకకువేచి=నా కాంతునిరాకకు నిరీక్షించి, నేనువిసివినాను=నేనువిసుఁగుచెందితిని. ఎన్నాళ్లు=ఎన్నిరోజులకని, గడియయేఁడుగన్ గడుపుదానన్ =ఒకగడియఒక సంవత్సరముగా పోనిత్తును?

తా. చెలియలార? ఈరేయికయినను కాంతుఁ డిందు రాఁగలఁడనుసూచనము లేవయినను గలవా? నాయురమును నాథుఁడొమ్మున గ్రుమ్మగల భాగ్యమునా కబ్బునా? మన్మథక్రీడలను గొసరిపొందఁగలనో? యింకనైనను మదనునితోడి పోరాటమణఁగునో? ప్రియునిరాకలకయి చూచిచూచి విసుఁగు నొందితిని. ఎన్నిదినములకని గడియను సంవత్సరముగాఁ గడుపుదానను.

సీ॥ ప్రాణేశుకౌఁగిఁటఁ బవళించి నట్లుగాఁ
గాంతరో నేఁగల గంటినమ్మ,
యలుకఁ దీర్చుచుఁ జెక్కు లదిమి ముద్దిడి మ్రొక్కి
కడువేఁడె ననికల గంటినమ్మ,
గబ్బిగుబ్బలఁ గ్రుమ్మి గాఢరతులఁ గూడి
కళలంటెనని కల గంటినమ్మ
కమ్మవాతెఱఁ బంటఁ గసిదీఱ నొక్కఁగాఁ
గలిగితినని కల గంటినమ్మ
గీ॥ యెన్నఁడిటువంటి కలలనే నెఱుఁగనమ్మ
యెచటనున్నాఁడో రాఁడాయె నేమిసేతు॥ చెలియ॥ 49

టీ. కాంతరో=ఓసఖీ! ప్రాణేశుకౌఁగిటన్ = విభునికౌఁగిలియందే, పవళించినట్లుగాన్ =పరుండినట్లుగా, నేఁగల కంటినమ్మ, అలుకఁదీర్చుచున్ =నాకోపమును బోకార్చుచు, చెక్కులదిమిముద్దిడి=చెక్కిళ్లయందొత్తిముద్దునుబెట్టి,

కదుర్ వేఁడెనని=మిగుల ప్రార్థించెనని- కలగంటినమ్మ. గబ్బిగుబ్బలన్ గ్రుమ్మి=ఱొమ్ములనదిమి, గాఢరతులన్ గూడి=గాఢమయిన రతిబంధమునందుఁ జిక్కించి, కళలంటెన్ అని=కళాప్రదేశములను తాఁకెనని, కలగంటినమ్మ, కమ్మవాతెఱన్=మధురమైన యధరమును, పంటన్=పంటిచేత, కసితీఱన్=నాకోపము తీఱునట్లుగా, నొక్కఁగాఁ గలిగితిని అని=అనంగఁ గలిగితినని, కలగంటినమ్మ, ఎన్నఁడును=ఏనాఁటికిని, ఇటువంటికలలను ఏను=నేను, ఎఱుఁగనమ్మ=తెలియనమ్మ, ఎచటనున్నాఁడో=ఏతావునందు వసించువాఁడో ? రాఁడాయెను, ఏమి సేతున్=ఏమిచేయుదును.

తా. ఓసఖీ! నేను నాప్రాణేశ్వరుని కౌఁగిటియందే పవ్వండియుండినట్లును అతఁడు నాయలుకలను బోఁగొట్టుచు చెక్కిళ్లను నొక్కి ముద్దులిడినట్లును, గాఢరతులను గలిసినట్లును, అప్పుడేను అతని మధురాధరమును నాకసి తీఱునట్లు పండ్లచే పీడింపఁగలిగినట్లును, కలలను గంటిని. ఎన్నఁడును ఇట్టికలలను గన్నదాననేగాను నాపతియిప్పు డెచటనున్నాఁడో? తెలియను. ఇచటికి రాఁడాయెను. ఏమిచేయుదును?

సీ॥ పతివచ్చె ననువార్త § పలికినసతికినా
పతకంబు మెడవేతుఁ § బంకజాక్షి,
సొంపుగా విభుమోముఁ § జూపిన నాముద్దు
టుంగరంబిత్తునే § యుత్పలాక్షి,
యతని నాతోమాట § లాడింప వజ్రాల
కమ్మల నిత్తునే § కంబుకంఠి,
క్రక్కునఁ బ్రాణేశు § కౌఁగిలిఁ జేర్చిన
చిలుకతాళిని నిత్తు § చిగురుబోణి,
గీ॥ వానిఁగలిసినఁ బదివేలు § వచ్చినట్లు
సొమ్ములివి యేమిగణ్యమే § సుందరాంగి॥ చెలియ॥ 50

టీ. పతి=విభుఁడు, వచ్చెనని పలికినసతికిన్=వచ్చినాఁడని చెప్పినకాంతకు,

పంకజాక్షి=ఓతామరసనేత్రా! నాపతకంబు మెడవేతుఁ=నాకంఠహారమునందలిపతకంబును దాని మెడవేసి గారవింతును, విభుమోముఁ = కాంతునిముఖమును, సొంపుగాఁ జూపినఁ=ఇంపుగాఁ గనఁబఱచిన, ఉత్పలాక్షి=నల్లకలువలవంటికండ్లు గలదానా? నాముద్దుటుంగరంబును ఇత్తునే, అతనిఁ=విభుని, నాతో మాటలాడింపఁ=నాతో ముచ్చటలాడునట్లు సేయఁగా, కంబుకంఠి=శంఖమును బోలినగళము గలదానా! వజ్రాలకమ్మలఁ = రవలకమ్మలను, ఇత్తునే=ఒసంగుదునే, చిగురుఁబోణి=చిగురాకువంటి మృదువైన శరీరముగల నా చెలీ! క్రక్కునఁ=శీఘ్రముగా, ప్రాణేశు=విభునియొక్క, కౌఁగిటఁ జేర్చినఁ = కౌఁగిలియందు నేను చేరునట్లు చేసినయెడల, చిలుకలతాళిని = చిలుకలవంటి బొట్టును, ఇత్తునే=ఇచ్చుదాననే, వానిఁ కలిసిన పదివేలు వచ్చినట్లు=వానితోఁ జేరిన పదివేలు నాకు లభించినట్లు, సుందరాంగి=సౌందర్యవతీ! సొమ్ములివి యేమి గణ్యమే=ఈనగలు నాకొకలక్ష్యమా!

తా. ఓ చెలీ! నాథుఁడు వచ్చినాఁడు అని శుభవర్తమానమును దెచ్చినకాంతకు నాపతకమును దానికంఠము నలంకరించి గారవింతును. అతనిమోము నాకు జూపించినతన్వికి నాముద్దుటుంగరమును ఇత్తును. అతని నాతో మాటలాడునట్లు చేయుదానికి వజ్రాలకమ్మల నిత్తును. నాథుఁడు నాతోఁ గ్రీడించునట్లు సేయుదానికి చిలుకలబొట్టును ఇత్తును. అతనిని గూడుటే నాకు పదివేలు. ఈసొమ్ములు నాకు లక్ష్యమునఁ జేరినవి కావు.

సీ॥ నిలిచిన చోటను నిల్వనీదు మనంబు
ముస్నె నిద్రాహారములు దొలంగె,
నీరీతి రేవగ లెదు రెదు రీక్షింప
నట తలవాకిలే యయ్యె నిల్లు,
పట్టగారాని నా బలుగుబ్బ లవి నిక్కి
కదువడిఁ బిగిలించెఁ గంచుకములఁ,
గమువిరహాగ్నికిఁ గ్రాఁగి ముత్తెపుసరుల్

వన్నెఁదక్కఁ కఱంగి సున్నమయ్యె,
గీ॥ వానిఁదలఁచక యుండనా వశముగాదు
తలఁచి, తమిహెచ్చఁగా నోర్వఁ దరముగాదు॥ చెలియ॥ 51

టీ. నిలిచినచోటను=నిలిచియున్న చోటియందు, మనంబునిల్వనీదు=మనస్సు నిలిచియుండనియ్యదు, నిద్రాహారములు=నిద్రయునుతిండియును, మున్నె తోలఁగెన్=ముందుగానే తొలఁగెను. ఈరీతిన్=ఈవిధముగా, రేవగలు=రాత్రింబవళ్లు, ఎదురెదురు ఈక్షింపన్=ఎదురులు చూచుచుండఁగా, అంటన్=అంతట. తలవాఁకిలే=ఇంటిబైటిద్వారబంధనమే, ఇల్లుఅయ్యెన్=నివాసస్థలమయ్యెను. పట్టగారాని=నాయాజ్ఞకులోఁబడని, బలుగుబ్బలు అవినిక్కఁ=ఉన్నత స్తనములు ఉబ్బి, కంచుకములన్=రవికలను, కడుపడిపిగిలించెన్=త్వరితముగా పిగిలిపోవునట్లు చేసెను. కడువిరహాగ్నికిన్ = అధికమయినవిరహానలమునకు, ముత్తెపుసరుల్ గ్రాఁగి=ముత్యాలహారములు గ్రాఁగినవియై, వన్నెఁదక్కి=వర్ణముచెడి, సున్నమయ్యె=నీఱు ఆయెను. వానిఁ దలఁచకయుండన్=వానిని మఱచిపోవుటకు, నావశముగాదు=నాశక్యముగాదు, తలఁచి=స్మరించి తమిహెచ్చఁగాన్=తమగము అధికముకాఁగా, ఓర్వఁదరముగాదు= తాళుకొనియుండుటకు శక్యముగాదు.

తా. నిలిచినచోటియందు నిలిచియుండుటకు బుద్ధిపుట్టదు. ఆతనిరాకతే యెదురుచూచుటలచేత యింటివాఁకిలియే నాయునికిపట్టయిపోయెను. మోహాతిశయమున నుల్బణముచెందిన స్తనములు కంచుకములను బిగిలింపసాగెను. విరహాగ్నిసెకలకు ముత్యాలహారము గ్రాఁగి సున్నమయ్యెను. వాని స్మరింపకయుండుటకు గాకున్నది. స్మరణము వలన తమకమును ఓర్చుటకుఁ గాదు.

సీ॥ నిదురఁ బోవుచు లేచి నిట్టూర్పు లధికమై
నెలఁత నేఁ డేమొ కన్నీ గ్రనించె,
చివ్వునఁ దా లేచి చిలుకను ముద్దాడి
దయయుంచు మని చాలఁ దల్లడిల్లె,

వీణానినాదముల్ \ వెలఁదులచేరికల్
కడుభారము లటంచుఁ \ గళవళించెఁ,
జెక్కిటఁ జేఁ జేర్చి \ చింతించు నూఱక
తలవాంచి కాల భూ \ తలము వ్రాయు,
గీ॥ నన్నపానీయములఁ గోర \ కున్నదకట!
యతివ యొకవేళఁ దెగునేమొ \ యంచుఁదెలిపి॥ చెలియ॥52

టీ. నెలఁత=నీనాయిక, నిదురఁ బోవుచున్ లేచి = నిద్రించుచుండిలేచి, నిట్టూర్పులు అధికమై=పెద్దయూఁపిరులు అధికముకాఁగా, నేఁడు ఏమొకన్నీ రునించెన్ = నేఁడెందులకో కంటఁదడిపెట్టుకొనెను. చివ్వనన్ =తటాలుమని, తానులేచి, చిలుకనుముద్దాడి, దయయుంచుము=కృపపెట్టుము, అని చాలఁ దల్లడిల్లెన్ =అని మిగుల పరితపించెను. వీణానినాదముల్ =వీణానాదములను, వెలఁదులచేరికల్ =చెలికత్తెలసావాసములను, కడుభారము లటంచున్ = మిగులభారములని, కళవళించెన్ =తొట్రిలెను, చెక్కిటన్ చేఁజేర్చి=చేతిని చెక్కిలియందు పొందించి, ఊఱక చింతించున్ =మిన్నకయోచించును. తలవాంచి =తలవంచుకొని, కాలన్ = కాలి (బొటనవ్రేలి) తో, భూతలమున్ =వ్రాయున్ =భూమిపై లేఖులువెట్టును. అకట=అయ్యో! అతివ=కాంత, అన్నపానీయములన్ =ఆహారపానీయములను, కోఱకున్నది=దగ్గఱరానీదు. ఒకవేళ తెగునేమొ=ఒకవేళమరణించునేమొ? అంచున్ తెలిపి=అనుచు మనవిని జేసి(కృష్ణుని తెమ్ము.)

తా. "ఓకృష్ణా! నీకాంత నిద్రించుచుండినదై తటాలుమనిలేచి, కండ్లనీరు నించెను. చివ్వనలేచి చిలుకను ముద్దులువెట్టి, దయచూపుము అని వేడికొనెను. వీణాధ్వనులును వెలఁదులకూటములును వ్రేఁగని యెంచి విడనాడును. చెక్కిట చేతినిచేర్చి దీర్ఘాలోచనచేయును. తలవంచి భూతలమును కాలిబొటనవ్రేలితో లిఖించును. అయ్యో! నీనాయిక యన్నపానంబులయందుకూడ రోతఁజెంది యున్నది. ఒకవేళ మరణమొందునేమొ" అని విన్నవించి నాయకునితోడి తెమ్ము.

సీ॥ బలువిసంబైనట్టి పాలుచక్కెరఁ ద్రావఁ
బోవ వేఁడెదరు పూఁబోఁణులార,
వెన్నెలచిచ్చులో వే నురికెద నఁటన్న
నడ్డముల్ వచ్చెద రతివలార,
తెగువతోఁ బూదండఁ దీసి కుత్తుక నిడఁ
జూచివద్దనెదరు సుదతులార,
బాగుగా నెదనుబూ బాకునఁ గ్రుమ్మఁబోఁ
జేవిడిపించెదర్ చేడెలార,
గీ॥ యోర్చి, యిఁకఁ బ్రాణములు బొంది నుంచఁదరమె ?
నెనరుగా మీరు దెల్పఁగా నిల్వఁదరమె? ॥ చెలియ॥ 53

టీ. బలువిసంబు=అధికవిషము, ఐనట్టిపాలుచక్కెరన్ = అయియుండు పాలును చక్కెరను, త్రావఁబోవన్ = త్రాఁగి మరణింతును అని పోవఁగా, పూఁబోఁణులార=కుసుమకోమలులార! అడ్డముల్వచ్చెదరు=అడ్డపెట్టెదరు. తెగువతోన్ =సాహసముతో, పూదండన్ దీసి=పూలహారమును ఎత్తి, కుత్తుకనిడన్ = (దేహమువదలుటకై) ఉరిపోసికొనపోఁగా, చూచి, సుదతులార=చెలులారా! వద్దనెదరు=వలదనెదరు. బాగుగాన్ =పొంకముగా, ఎదను = ఱొమ్మునందు, పూబాకునన్ =పుష్పమనుఖడ్గముచేత, గ్రుమ్మన్ పోన్ =గ్రుమ్మికొనుటకుపోఁగా, చేడెలార=చెలులారా ! చేవిడిపించెదరు=చేతినుండి యాయుధములను దొలఁగించెదరు. ఓర్చి=తాలిమినిజెంది, ఇఁకన్ =ఇఁకమీఁద, ప్రాణములన్ = జీవములను, బొందిన్ = గాత్రమునందు, ఉంచఁదరమె=ఉంచియుండుటకు శక్యమా?

తా. ఇక్కడ నాయికయొక్క వ్యభిచారీభావమునందలిమరణభావమును గవి వర్ణించినాఁడు. చెలులారా! శరీరయాత్రను నిలుపవలె ననుతలంపుతో పాలుచక్కెర అనువిషమును ద్రావఁబోఁగా చూచివద్దనెదరు. వెన్నెల అను పెను చిచ్చులో దుముకుటకుపోవఁగా అడ్డుపడెదరు. పూదండతో నురిపోసి

కొనుటకుపోఁగా తప్పించెదరు. పూబాకుతో ల్లొమ్మునఁ బొడిచికొనుటకు ప్రయత్నింపఁగా వలదని యాటంకపఱచెదరు. ఇఁకనోర్పును దెచ్చుకొని జీవించియుండ నాశక్యమా?

సీ॥ శుకమ నావెతఁ జూచి ♦ చూడనట్లున్నావు
  ప్రియుని రమ్మని వేఁగఁ ♦ బిల్వరాదె!
పికమ నావెతఁ జూచి ♦ ప్రేమలేకున్నావు
  విభునకు నెనరుట్ట ♦ వేఁడరాదె
హంస నావెతఁ జూచి ♦ యట్లూఱకున్నావు
  పతిమతిఁ గృపపుట్టఁ ♦ బల్కరాదె
తేఁటి నావెతఁ జూచి ♦ మాటాడకున్నావు
  శ్రీహరితోఁ జేరి ♦ చెప్పరాదె,
గీ॥ యనుచు బతిమాలునది యని ♦ మనము సోకు
  నట్లు సెప్పంగఁ గరుణతో ♦ నచటికిప్డు॥ చెలియ నీవేగి॥ 54

టీ. శుకమ=ఓకీరమా! నావెతన్ జూచి = నాకష్టములనుజూచియు, చూడనట్లున్నావు=పరామరికదక్కియున్నావు. వేఁగన్=శీఘ్రముగా, ప్రియునిన్=విభుని, రమ్మనిపల్కరాదె=రమ్ము అని చెప్పరాదా? పికమ = ఓకోయిలా! నావెతఁజూచి=నావ్యసనమునుగాంచియు, ప్రేమలేకున్నావు = ప్రీతిదక్కియున్నావు. విభునకున్=ప్రియునికి, నెనరుఉట్టన్=కృతజ్ఞతగలుగునట్లు, వేఁడరాదె=ప్రార్థించరాదా? హంస=ఓమరాళమా? నావెతన్ జూచి=నాహింసను 'జూచి' అట్లు ఊఱకున్నావు=పలుకకున్నావు. పతిమతిన్=విభునియెదను, కృపపుట్టన్=దయగలుగునట్లు, పల్కరాదె=చెప్పరాదా? తేఁటి=ఓతుమ్మెదా! నావెతన్ జూచి=నీబాములనుగని, మాటాడకున్నావు=పలుకకున్నావు, శ్రీహరితోన్ చేరి=శ్రీనాథునికడకేగి, చెప్పరాదె=నాపాటులను చెప్పకూడదా, అనుచు బతిమాలునది=అనిశుకపికమరాళభ్రమరంబులను వేఁడుచున్నది, అనిమనసుసోఁకునట్లు=డెందమునకుఁ దగులునట్లు, చెప్పంగన్=చెప్పుటకయి, కరుణ

తోఁ = నాయందలిదయతో, అచటికిఁ నాథుఁడున్నచోటికి, ఇప్డు=ఇప్పుడే, (నీవేగి కష్ణునితోడి తెమ్ము.)

తా. ఓశుకమా! పికమా! మరాళమా! భ్రమరమా! మీరేల నావెతలనుగాంచియును నోరు తెఱువకున్నారు. పోయి నాకష్టములును పతికి విన్నవింపరాదాయని పలువరించెడిని "నీనాయిక" యని చెప్పి కాంతుని యిప్పుడే తోడి తెమ్ము.

సీ॥ పంచశరుం డొక ప్రళయకాలయముండు
చిన్నపెంపుడుచిల్క చిట్లకొఱవి
సాకు నీకోయిల చంపెడు పెనుబోయ
సంతరించిన నెమ్మి చాడికత్తె
పవనంబు చూడ నిర్భర మైనమృత్యువు
వెనుఁగొన్న తేఁటులే యనలరాశి
ప్రియమైనహంసల పిల్లలు పిడుగులు
చంద్రుండు పగవాఁడు; శత్రుకోటి

గీ॥ యైనవారలె కాని నాకైనవారిఁ
గాన; నేనెట్లు జీవింతు వానిఁగనక॥ చెలియ॥ 55

టీ. పంచశరుండు=మన్మథుఁడు, ఒకప్రళయకాలయముండు = లయకాలయముఁడును, చిన్నపెంపుడుచిల్క=సాకునట్టి యీచిన్నరాజకీరము, చిట్లకొఱవి=మంటమాఱి; సాకునీకోయిల=పెంపుడుకోకిల మయినయిది, చంపెడు పెనుబోయ=క్రూరుఁడయిన వ్యాథుఁడును, సంతరించిన=బాగుపఱచి పెట్టిన, నెమ్మి=యీనెమిలి, చాడికత్తె=చాడిచెప్పునది, పవనంబుఁ చూడఁ=గాలినిచూడఁగా, నిర్భరమైన మృత్యువు=ఓర్వరాని మృత్యుదేవత, వెనుఁగొన్న తేఁటులే=(యనుచరములై నావేణిని) అంటివచ్చెడు తుమ్మెదలే, అనలరాశి=అగ్నిసంచయము, ప్రియమైన హంసలపిల్లలు=ఇష్టములైన యంచపిల్లలపిండులు, పిడుగులు=పిడుగుతునియలును, చంద్రుండు పగవాఁడు=చంద్రుఁడు శత్రువు; శత్రుకోటి యైనవారలె

కాని=విరోధులగుంపులే వీరలుగాని, నాకైనవారిన్ గానను=నా కిష్టులను గనను, వానిఁగనక=వానింజూడక, ఏనెట్లు జీవింతున్ = నేనెట్లు బ్రదుకుదును.

తా. మన్మథుం డొకకాలుఁడు; ఈ పెంపుఁడుచిలుకయైనది-చిల్లకొఱవి. పెంచునట్టి యీకోవెల చంపునట్టి వ్యాధుఁడు. పెంచినట్టి యీ నెమిలి చాడికత్తె. ఈమలయానిలు డొకమృత్యుదేవత. ప్రియాస్పదములయిన యంచలపిల్లలు పిడుగుతునియలు. చంద్రుఁడు విరోధి. ఇట్లు నాకైనవారలె శత్రుకోటిలోని వారలై కానివారయిరి; కాఁబట్టి వానిఁగనక యెట్లు జీవింతును.

సీ॥ అళుల నబ్జబిలంబులందుఁ జొప్పింతును
తరుపత్రముల శుకతతిని వైతు,
కోకిలంబులఁ జెట్లకొనల నుండఁగబంతు
నడవిఁ గల్పుదు మయూరావళులను,
తెమ్మెర నుఱికింతు దిగ్దేశములమీఁద
జాబిల్లిఁ గళలంట సమయఁజేతు,
మంటలఁ గలుపుదు మన్మథుశరములు
వేఁగ నచ్చటి కేఁగి విభుసిదెత్తు,
గీ॥ నిపుడు పిల్వఁగ రాకున్న నిందువదన
యేననినపంతముల నిర్వహింతు ననవె॥ చెలియ॥ 56

టీ. ఇప్పుడు పిల్వగ రాకున్నన్=పిలిచినతోడనే యిపుడు నాయకుఁడు రాకుండినయెడల, ఇందువదన=ఓచంద్రముఖీ! అళుల నబ్జబిలంబులందున్ చొప్పింతును=తుమ్మెదలను తామరమొగ్గలబొరియలలో దూఱునట్లు చేయుదును, తరుపత్రములన్ = చెట్లయాకులతోడుపాటుగ, శుకతతిని వైతున్=చిలుకల గమిని వేయుదును. కోకిలంబులన్=పికములను, చెట్లకొనలన్ = చెట్లమొనలయందు, ఉండఁగన్ పంతున్=ఉండునట్లు ఆజ్ఞాపింతును, మయూరావళులను=నెమిళ్లగుంపులను, అడవిఁ గల్పుదున్=అడవులయందు వసింపఁగా చేయుదును, దిగ్దేశములమీఁదన్=నానా దిక్ప్రదేశములను, తెమ్మెరన్ ఉఱికింతున్=గాలిని

పరుఁగె_త్త నిత్తును. జాబిల్లిన్ =చంద్రుని, కళలంటన్ సమయింతున్ =కళలను ధ్వంసము చేయుదును. మన్మథుశరములన్ =మదను బాణములను, మంటఁగ లుపుదున్ =మంటలపాలు చేయుదును. అచ్చటికిన్ =నాపగదాని యింటికి, వే గన్ ఏగి=శీఘ్రముగాపోయి, విభునిన్ తెత్తున్ =పెనిమిటిని వెంటఁ బెట్టుకొని రాఁగలను. నేననిన పంతములన్ =నేను పల్కిన పందెములను, నిర్వహింతున్ = సమర్థింతును. అనవె=అని చెప్పుమీ.

తా. ఓచంద్రవదనా! నీవిపుడుపోయి పిలిచినదే యతఁడు రాక మసలెనో తామరమొగ్గల బిలంబులయందు భ్రమరములను చొప్పింతును (భ్రమరములు తామరసకుట్మలములయం దణఁగియుండుట కవిసమయము. దాని నీనాయిక పసుపుగా వర్ణించుట కవియొక్క చమత్కారవిశేషమని తెలియునది ఇట్లే అంతటనూహించునది) చెట్లయాకులతోడిపాటుగ నుండునట్లు చిలుకలను జేయుదును. చంద్రునిక్షీణకళునిగాఁజేయుదును. మదనుబాణములను మంటఁగలుపుదును. అత్యంతత్వరితముగా నచటికిఁబోయి, పతిని తెత్తును. ఇప్పుడు చెప్పిన పందెపుమాటలను తప్పక నిర్వహించి తీఱుదునని చెప్పుము.

సీ॥ విభుని నేఁ బిలిచెద ‡ వేఁగ రాఁడాయెనా
యతినిష్ఠురోక్తుల ‡ నందుఁగాక,
రాక నన్నేచి మా ‡ ర్వలికిన విడుతునా
తెగువఁ జేతులఁ బట్టి ‡ తెత్తుఁగాక,
యంతలో నది చూచి ‡ యడ్డంబు వచ్చెనా
వెఱవక జడఁగొని ‡ వేతుఁగాక,
యిందులకతఁడు వశిహించుక వచ్చెనా
దానితోఁ దగవాడఁ ‡ దలఁతుఁగాక,
గీ॥ యింతమాత్రంబు సేత నా ‡ కెంత గనఁగ
నిలను మర్యాద కోర్చితి ‡ నింతదనుక॥ చెలియ॥ 57

టీ. విభునిన్ =నాయకుని, నేఁబిలిచెదన్ =పోయి నేను పిలిచెదను. వేగన్ =

రాదాయెనా=శీఘ్రముగా రాఁడో? అతినిష్ఠురోక్తులన్ అందున్ గాక=మిక్కిలికఠినము లయినమాటలను ఆడుదును గాక! రాక, నన్నేచి=నన్ను మీఱి, మార్వలికినన్=బదులు చెప్పినయెడల, విడుతునా=విడిచి పెట్టుదునా? తెగువన్=సాహసమున, చేతులన్ పట్టి=అతని చేతులను బట్టుకొని, తెత్తుఁ గాక=వెంటఁబెట్టుకొని వత్తును గాక, అంతలోన్=ఈలోఁగా, అదిచూచియడ్డంబు వచ్చెనా=అది కనుఁగొని యడ్డపడెనా? వెఱవక=భయపడక, జడగొని = నాజడనుపట్టుకొని, వేఁతుగాక=కొట్టుదును కాక. ఇందులకతఁడు వహించుకవచ్చెనా= ఇందులకయియతఁడు దానిని వహించికొని వచ్చెనో? దానితోఁదగవాడన్ =దానితో జగడమాడుటకు, తలఁతుఁ గాక =ఆలోచింతును గాక. ఇంతమాత్రంబు చేత = ఇంతమాత్రపుపని, కనఁగన్ =చూడఁగా, నాకెంత=నాకెంతమాత్రము, ఇలను=పుడమిమీఁద, ఇంతదనుక=ఇంతవఱకును, మర్యాదకోర్చితిన్ =పరువునకు భయపడుచుంటిని.

తా. ఓసఖీ! ఇదే పోయి కాంతుని పిలిచెదను. రానుఅన్న యెడల నిష్ఠురములాడెదను. అందుకుమాఱు పలికినవదలుదునా? చేతినిబట్టి యీడ్చికొనివచ్చెదను. అందులకది యడ్డమువచ్చెనో? నాజడతో దాని గొట్టెదను. అందులకతఁడు వహించుకొనివచ్చునో, తప్పక దానితో బెద్దకలహమును పెట్టుకొనెదను. ఇంత తెలియకపోయెనా? యిదివఱకును పరువును దలఁచియుంటిని.

సీ॥ ప్రాణేశుఁ డేతేరఁ ? బారఁజూచుచు వాని
కెదురేగి కౌఁగిటఁ ? నిడఁగలేదొ,
యాకుమడ్పుల నిచ్చు ? నంతలో దమి హెచ్చి
కరుణతో నుపరతిఁ ? గలియలేదొ,
యలిగి నే మునుఁగిడి ? యటు పవ్వళించిన
విభుఁడు పల్కుఱ నన్ను ? వేఁడలేదొ,
ప్రియుఁ డల్కఁగొని నన్ను ? వెస డాయక యయున్న
నక్కునఁ జేర్చ నే ? మ్రొక్కలేదొ,

గీ॥ నాఁటివారమగామె; యీ నాఁటి కిట్లు
దైవ మతనికి ననుఁ గాని దానిఁ జేసె॥ చెలియ॥ 58

టీ. ప్రాణేశుఁడు ఏతేరన్=పెనిమిటి వచ్చుచుండఁగా, పాఱఁజూచుచున్=దృష్టిని సారించుచు, వానికెదురేగి=వానికి నెదురుగాపోయి, కౌఁగిటన్=కౌఁగిలియందు, ఇడఁగలేదా=ఉంచుకొనలేదా. ఆకుమడుపులన్ ఇచ్చునంతలోన్=ఆకుమడుపులను అందియిచ్చునంతటిలో, తమిహెచ్చి = మోహాధికమయి, కరుణతోన్=దయతో, ఉపరతిన్ గలియలేదా=పుంభావక్రీడలను సలుపలేదా, నేనుఅలిగి, ముసుఁగిడి, అటుపవ్వళించినన్=తిరిగిపరుండఁగా, పల్కులున్=పలుమాటలను,నన్ను,విభుఁడు, వేఁడలేదా=వేఁడుకొనలేదా, ప్రియుఁడు=విభుఁడు,అల్కఁగొని=కోపమునొంది, నన్నున్, వెసన్=త్వరితముగా, డాయకయ యున్నన్=దగ్గఱించకయే యుండఁగా, అక్కునన్ చేర్పన్=ఱొమ్మునందు చేర్పించుటకై, ఏను మ్రొక్కలేదా=నేనునమస్కరింపలేదో, నాఁటివారమగామె=ప్రాఁతవారమేగదా? ఈనాఁటికిఇట్లు=ఈకాలమునను గదా, దైవము=విధి, అతనికి, ననున్, కానిదానిన్=పగదానినిగా, చేసెన్=చేసెను.

తా. జీవితేశుఁడు వచ్చుటనుజూచి, యెదుర్కొనిపోయి కౌఁగిలింపనో? ఆకుమడుపుల నిచ్చునంతలో నాకు మోహాము అగ్గలముకాఁగా ఉపరతిసల్పనో? నేను కోపమొంది యుండునప్పు డతఁడుగాని, యతఁడుపాలయల్కలను జెందియున్నప్పుడు నేనుగాని, పరస్పరము వేఁడికొనుటచే ప్రసన్నతలనుజెంది, రతిసుఖంబనుభవింపమో? మేమేమియీనాఁటివారమా; పాడువిధి నేటికాలమున కేమొ నన్నతనికి కానిదానినిగాఁ జేసెను.

సీ॥ కోఁకిల లవిచాలఁ గూయసాగు నటంచుఁ,
బద మున్నతస్థాయిఁ బాడ వెఱతు;
చిలుక లాలించినఁ జెలఁగి వల్కు నటంచు,
నోటఁ దిన్నఁగ మాట నుడువ వెఱతు;
నళులు గన్గొన్న ఝుమ్మనుచు మ్రోఁగు నటంచుఁ,

బయ్యెద జడనుండి । పాప వెఱతు;
నిలువెళ్లఁగాఁ జంద్రుఁ । డేర్చి కాయు నటంచు,
వేఁడి వెన్నెలఁ దేటి । చూడ వెఱతు;
గీ॥ వీరికెల్లను నేనింత । వెఱచుచున్న
వేడ్క లొదవెను వెఱపించి । వెంబడింప॥ చెలియ॥ 59

టీ. కోకిలలు=పికములు, చాలన్ కూయసాగును అటంచున్=మిగుల కేకలువేసి మదనోన్మాదమును పెంచునో? అని భయపడి, పదమున్=పాటను, ఉన్నతస్థాయిన్=పంచమస్థాయిలో, పాడ వెఱతున్=పాడుటకు భయపడుదును, చిలుకలు ఆలించినన్=కీరములు విన్నయెడల, చెలఁగిపల్కునటంచున్=చెలరేగి మాటలాడునని, నోటన్=నోటినుండి, మాటఁ దిన్నఁగన్ నుడువన్=మాటను నెమ్మదిగా మాటలాడుటకు, వెఱతున్=భయపడుదును. అళులుగన్గొన్నన్=తుమ్మెదలు చూచినయెడల, జుమ్మనుచు మ్రోఁగునటంచున్=జుమ్మని ఝుంకారములు సలుపునని, జడనుండి=వేణీభరమునుండి, పయ్యెదన్=కొంగుమునుఁగును, పాపన్ వెఱతున్=తొలఁగింప భయపడుదును, ఇలు వెళ్లఁగాన్=ఇంటినుండి కదలినచో, చంద్రుండు, వేఁడి వెన్నెలన్=వేఁడియైన వెన్నెలను, ఏర్చి కాయున్ అటంచున్=విజృంభించి కాయును అని, చూడ వెఱతున్=చూచుటకు భయపడుదును, వీనికెల్లను=ఇట్టిమన్మథపరివారముల కన్నిఁటికిని, వెఱచుచున్నన్=భయపడుచుండఁగా, (వానికి) వెఱపించి వెంబడింపన్=భయపఱచుచు వెంబడించి వచ్చుటకు, వేడ్కలొదవెను=సంతోషము గలిగెను.

తా. కోకిలలు ఎక్కడప్రతిధ్వనులచే దిగులును పెంచెడినో యని పదములను పంచమస్వరమునఁ బాడుటకు భయముచెందుదును. చిలుకలు ఎక్కడమాఱు పలికి బెదరించునోయని మాటలను గట్టిగా ఆడను. తుమ్మెదలు చూచిన నెక్కడ వెన్నంటివచ్చునో యని జడమీఁదిముసుఁగునుదీయను. చంద్రుఁడు వేఁడి వెన్నెలలచేత ఎక్కడ నాశరీరమును గాల్చునోయని యిలువెడలను. ఇట్లు మన్మథపరివారముల కేను భయపడి నడుచుకొనఁగా, భయపడినదానిని మఱింత వెఱపించుటకు వాని కుత్సాహము గలిగియున్నది.

సీ॥ మరుని కేతనములు ✽ మడువులఁ గలవంచు
నందుల జలకంబు ✽ లాడ వెఱతు,
దర్పకుధను విక్షు ✽ దండంబటంచు నే
నేమఱి చెఱకుపే ✽ రెత్త వెఱతు
విరులెల్ల మన్మథు ✽ శరజాలము లటంచు
ముచ్చటకై పూలు ✽ ముడువ వెఱతు,
భావజుచతురంగ ✽ బలము లటంచును
శుకపిక నికరముల్ ✽ సూడ వెఱతు,
గీ॥ నోట 'వలరాజ' టంచును ✽ నుడువ వెఱతు
వెఱచుచున్నను దయలేక ✽ వెంబడించె॥ చెలియ॥ 60

టీ. మరుని కేతనములు=మన్మథ ధ్వజములైన మీనములు, మడువులన్ గలవు అంచున్=మడుగులలో నున్నవని, అందులన్=అచ్చోట, జలకంబులాడన్=స్నానములాడుటకు, వెఱతున్=భయపడుదును. దర్పకుధనువు=మదనునివిల్లు, ఇక్షుదండంబటంచున్=చెఱుకుకోలయని, చెఱకు పేరున్=చెఱకు అనుమాటను, ఏమఱి=మఱచియైనను, ఎత్తన్ వెఱతును=ప్రస్తావించుటకు భయపడుదును. విరులెల్లన్=పువ్వు లన్నియును, మన్మథుశరజాలములు=మన్మథుని బాణములు, అటంచున్=అనుచు, ముచ్చటకై=వినోదార్థముగా నైతము, పూలు ముడువన్=పుష్పములను కొప్పుఁజేర్చుటకు, వెఱతున్=భయపడుదును. భావజు=మన్మథుని యొక్క, చతురంగబలములు=చతురంగసేనలు, అటంచున్=అనుచు, శుకపిక నికరముల్=చిలుకలు కోవెలలు మొదలగువాని గుంపులను, చూడ వెఱతున్=చూచుటకు భయపడుదును. నోటన్=మాట మాత్రముగా, వలరాజు=మన్మథుఁడు, అటంచు, నుడువన్=చెప్పుటకు, వెఱతున్=భయపడుదును. వెఱచుచున్నను=ఇట్లు భయపడుచున్నను, (అవి) దయలేక=కృపయును లేక, వెంబడించెన్=నా వెన్నంటివచ్చెను.

తా. మన్మథునిధ్వజములని మీనములుండు పద్మాకరములయందు స్నానమా

డను. మన్మథునివిల్లు అని మఱచియైనను చెఱకు పేరును ఎత్తను. పువ్వులు మన్మథునిబాణములని యెంచి కొప్పున దురుమను. మదనుని చతురంగబలములనుచు శుకపికాదులను దేఱిచూడను. నోటితో మన్మథస్మరణమును జేయను. ఇట్లు భయపడుచుండినను వీరందఱు నన్నుమఱింత భయపఱచెదరు.

సీ॥ పక్షులఁ దిట్టుట ॥ పాపమంచు గణింప,
నెదురొడ్డి కూయుట ॥ లేమిపికమ?
యందఱకనుకూలి ॥ వని దయఁజూచిన,
తాపంబు వెంచుదు ॥ తగదు చంద్ర!
ప్రాణికోట్లకునీవు ॥ పరమాప్తుఁ డని యోర్వ,
నెప్పుడువీఁచెద ॥ వేమిపవన?
తనయుని శపియింపఁ ॥ దగదని తాళిన,
నిషువుల నేసెద ॥ వేమి మదన?

గీ॥ యనుచు నయభయంబుల నెన్నని ॥ యనిన వినరు,
బహుదురాత్ముల కేటికృ ॥ పారసంబు॥ చెలియ॥ 61

టీ. పక్షులఁదిట్టుట=పక్షిగణములను దూషించుట, పాపమంచు గణింపన్ = దోషమంచు ఎన్నఁగా, పికమ = ఓకోయిలా! ఎదురొడ్డి కూయుటలేమి=ఎదిర్చి పలుకుటలేమి? అందఱికిన్ =సర్వప్రాణులకును, అనుకూలివిఅని=అనుకూలమయినవాఁడవని, దయఁ జూచినన్ =కృపపెట్టఁగా, తాపంబున్ పెంచెదు= వేఁడిమిని వెలయించెదవు, చంద్ర=ఓచంద్రుఁడా! తగదు=ఇట్టిపని నీకు చెల్లదు, ప్రాణికోట్లకున్ =జంతుజాలములకు, నీవుపరమాప్తుఁడవు అనియోర్వన్ =నీవు మిక్కిలియిష్టుఁడవు అని యోర్చికొనియుండఁగా, పవనా=ఓమారుతమా! ఎప్పుడును వీఁచెదవేమి=ఎప్పటికిని వీఁచుచున్నావేమి? తనయునిన్ =కొమారుని, శపియింపన్ తగదు అనితాళినన్ =శాపమియ్యరాదు అనియోర్చికొనిన, మదన= ఓమన్మథా! ఇషువుల నేసెదవేమి=ఏల బాణంబులను ఏయుచున్నావు? అనుచున్ =ఇట్లనుచు, నయభయంబులన్ =నీతిగాను భీతిగాను, ఎన్నినియనినన్ =

ఎన్నెన్నో చెప్పినప్పటికిని, వినరు=వినువారు గారు. బహుదురాత్ములకున్=మిక్కిలి చెడుగులకు, ఏటికృపారసంబు=దయారసం బెక్కడిది.

తా. పక్షిగణములను దూషించుట మహాదోషమనియెంచిన అదేమి పికమా ఊఱక ఎదురొడ్డి పదరెదవు? అందఱకును హితుఁడవని దయపెంచఁగా, చంద్రా! మితి మీఱి వేఁడివెన్నెలలను గాసెదవేల? ప్రాణులకందఱకును మిగులనిష్టుఁడవని యోర్చికొనియుండఁగా, ఓపవనా! అదేలయిట్లు వీఁచెదవు? కుమారునికి శాపమిచ్చుట రోఁతగాఁ దలపోయుచుండఁగా ఓమన్మథా! యీవిణ్ణేల బాణములేసెదవు? అనినయభయములు దోఁచుపల్కులనెన్ని యాడిననువినరు. దుష్టులకేది దయారసము ?

సీ॥ అడవిలో నొకవృక్ష మై పుట్టఁగావచ్చు,
బుడమిపై నాఁడుదై పుట్టరాదు;
కడుఁబెద్దచట్రాయి గాఁ బుట్టఁగావచ్చుఁ,
బుడమిపై నాఁడుదై పుట్టరాదు;
పురుషులై పలుమాఱుఁ బొదలి పుట్టఁగవచ్చుఁ,
బుడమిపై నాఁడుదై పుట్టరాదు;
పక్షులై మృగములై పలుగఁబుట్టగవచ్చుఁ,
బుడమిపై నాఁడుదై పుట్టరాదు;
గీ॥ ఆఁడుదై పుట్టనీచమా నదియుఁగాక,
పురుషు నెడఁబాయుదానిదౌ పుట్టుకేల?॥ చెలియ॥ 62

టీ. అడవిలోన్=కాఁటిలో,ఒకవృక్షమై=ఒకచెట్టుగా,పుట్టఁగావచ్చున్=జన్మింపవచ్చునుగాని, పుడమిపై=భూమిపై, ఆఁడుదివై పుట్టరాదు=స్త్రీజన్మ మెత్తతగదు. కడుఁబెద్ద చట్రాయిగాన్=పెద్దచట్టు బండఁగా, పుట్టగావచ్చున్=జన్మింపవచ్చునుగాని, పుడమిపైనాఁడుదై పుట్టరాదు; పురుషులై=మగవాండ్రుగా, పొదలి=ఒప్పి, పలుమాఱుపుట్టగవచ్చున్=పలుతడవలకు పుట్టగావచ్చునుగాని, పుడమిపైనాఁడుదైపుట్టరాదు; పక్షులైమృగములై పలుగఁబుట్టఁగవ

చ్చున్=పక్షులగాను మృగములుగాను ఒప్పనట్టుగా పుట్టవచ్చునుగాని, పుడమి పైనాఁడుదై పుట్టరాదు; ఆఁడుదై పుట్టన్=స్త్రీగాజన్మించినయెడల, నీచమాన దియుఁగాక=హీనత్వము గలుగుటయెగాక, పురుషున్ ఎడఁబాయుదానిది= జీవితేశుని తొలఁగియుండు దానియొక్క, జన్మమేల=పుట్టుకయేల?

తా. అడవిలోచెట్టుగా పుట్టవచ్చును; పెద్దచట్రాయిగా జన్మమెత్తవచ్చును; అనేక తడవలకు పురుషులుగా జన్మింపవచ్చును. పక్షులుగాను జన్మింపవచ్చును. గాని,ఆఁడుజన్మమీభూమిపై నెత్తరాదు. ఆఁడుదిగా జన్మించినను, పురుషునెడఁ బాయునదిగా శరీరము నెత్తరాదు.

సీ॥ మహిం నూతనాప్రియుల్ ॥ మగవాండ్రటందురే
యామాట నిక్కవం ॥ బయ్యెనమ్మ,
ననఁబోడి పురుషుల ॥ నమ్మరా దందురే
యామాట నిక్కవం ॥ బయ్యెనమ్మ,
యాఁడుది వలచిన ॥ హాయిలే దందురే
యామాట నిక్కవం ॥ బయ్యెనమ్మ,
యధిపులు కఠినాత్మ ॥ లని జనులందురే
యది యిప్పు డనుభవం ॥ బయ్యెనమ్మ,
గీ॥ సకియ! పెద్దలమాటలు ॥ సటలు గావు
పలుకుసామ్యంబులెల్ల దబ్బరలు గావు॥ చెలియ॥ 63

టీ. మహిన్=భూలోకమునందు, మగవాండ్రు=పురుషులు, నూతనాప్రియులటందురే=క్రొత్త స్త్రీలయెడల ఆసగలవారని చెప్పుదురే, అమాట=ఆసుద్ది, నిక్కవంబయ్యెనమ్మ=నిజమాయెనమ్మ, ననఁబోఁడి=చిగురువంటి మేనుఁ గలదానా! పురుషులనమ్మరాదందురే=మగవాండ్రనునమ్మకూడదని చెప్పుదురే, ఆమాటతథ్యంబయయ్యెనమ్మ=అమాట సత్యమేయయ్యెనమ్మ, ఆఁడుదివలచినన్=స్త్రీతానుగా మోహించినచో, హాయిలేదుఅందురే=నెమ్మదిగలుగదు అని చెప్పుదురే, ఆమాటసత్యంబయయ్యెనమ్మ=అనూక్తి నిజమే యాయెనమ్మ. అధిపులు=ప్రభులు,కఠినాత్ములు

అనిజనులందు రే=కఠినహృదయులు అనిజనులు వాడుకొందురే, అది=ఆమాట, ఇప్పుడు అనుభవంబయ్యెనమ్మ=ఇప్పుడు నిజమాయెనమ్మ, సకియ=ఓ చెలీ, పెద్దలమాటలు సటలుగావు = పెద్దలు చెప్పనుడువులు వ్యర్థములుగావు, పలుకుసామ్యంబు లెల్లన్ =వాగాడునట్టి సాదృశ్యవాక్యము లన్నియును, దబ్బరలుగావు=అసత్యములుగావు.

తా. ఓ చెలీ! మగవాండ్రు నూత్న స్త్రీప్రియులని చెప్పుదురే యామాటలును నిశ్చయములే. స్త్రీలు మోహించుటవలన సుఖములేదని చెప్పుదురే, యాయుక్తియును సత్యమే. ప్రభువులకు చిత్తకాఠిన్యము అధికమని చెప్పుదురే అదియును యథార్థమే. పెద్దలు చెప్పుమాటలును సామ్యములును అసత్యములగునా?

సీ॥ పలపుమందెఱింగిన ♦ వారిని నడుగరే !
దానిపై మోహంబు ♦ దఱుఁగుఁగాని;
మంత్రజ్ఞులను బిల్చి ♦ మక్కువ లడుగరే !
వేగంబ యలదాని ♦ విడుచుఁగాని;
మచ్చుఁజల్లెడుయుక్తి ♦ మఱుఁగుగా నడుగరే !
యూఱక ననుఁ బాయ ♦ కుండుఁగాని;
యంత్రమ్ములను వేయు ♦ నధికుల వెదుకరే !
వడిగ నాయింటికి ♦ వచ్చుఁగాని;
గీ॥ యయిన నొకసారి పోయిరా ♦ వమ్మ ! విభుఁడు
రాక యుండిన నాకర్మ ♦ మేకదమ్మ॥ చెలియ॥ 64

టీ. వలపుమందున్ =మోహనౌషధమును, ఎఱింగినవారిని= తెలిసినవారిని, అడుగరే=అడిగి తెలిసికొనుఁడీ (ప్రయోగించిన) దానిపైవలపున్ = దానిమీఁది మోహము, తఱుఁగుగాని=తగ్గిపోవచ్చును,మంత్రజ్ఞులను బిల్చి=మాంత్రికులను రప్పించి, మక్కువలు అడుగరే=(వశీకరణంబులం గూర్చిన) ప్రేమలనుగూర్చి విమర్శింపుఁడీ, వేగంబ యలదాని విడుచున్ గాని=(విభుఁడు) శీఘ్రముంబుగా దాని వదలిపెట్టునుగాని, మఱుఁగుగాన్ =రహస్యముగా, మచ్చుచల్లెడియుక్తిన్ =

సౌఖ్యపాడము వేయునట్టిగుట్టును, అడుగరే=అడిగి తెలిసికొనుఁడీ, (విభుఁడు) ఊఁటక ననుఁబాయక ఉండుఁగాక=మిన్నక నాతోడనే పడియుండునుగాక, యంత్రమ్ములను వేయునధికులన్=యంత్రములను వేయునట్టినిపుణులను, వెదుకరే=వెదుకుఁడీ, వడిగన్=శీఘ్రముగా, నాయింటికిన్=నాగృహమునకు, వచ్చుఁగాని=(విభుఁడు) వచ్చునుగాక, అయినన్=ఎట్లున్నను, ఒకసారిపోయి రావమ్మ=ఒకతేఁపకు పోయిరమ్ము, విభుడు=కాంతుఁడు, రాకుండినన్=రాకపోయినయెడల, నాకర్మమేగదమ్మ=నేను తొల్లి చేసినదుష్కర్మమే గద!

తా. మోహనౌషధములను దెలిసినవారిని పిలుచుకొని రండు, అందువలన నతఁడు దానిపై తలంపును వీడునుగాక, మాంత్రికులను రప్పించి వశీకరణప్రయోగంబులను జూడుఁడీ! అందుచేత విభుఁడు దాని వదలిపెట్టునుగాక! మచ్చుపాడులు చల్లుమర్మంబులను దెలిసికొనుఁడు అందుచే నన్నే పాయకయుండునుగాక యంత్రమ్ములను వేయునట్టివారిని అరయుఁడు. అందువలన నతఁడు నాయింటికి వచ్చునుగాక. ఐనప్పటికిని ఈతూరికీవు అచటికిపోయిరమ్ము అతఁడు వచ్చెనా? మేలయ్యెను. రాక నిలిచినయెడల నాకర్మమనుకొనెదను.

సీ॥ కమలాక్షువాతెఱఁ । గసిదీఱనొక్కి నా
పగఁదీర్చుకొందునో । పంకజాక్షి!
చన్గొనలనె యురస్స్థలము నొప్పించి నా
చలము సాధింతునో । చంద్రవదన!
యక్కున బిగఁజేర్చి । యలయికఁ గ్రమ్మించి
మచ్చర మ్మీడేర్తు । మందయాన!
(వాఁడిచూఁపులఁ జూచి । వరుని వేఁడఁగఁజేసి
కోర్కులఁ బోషింతుఁ । గోమలాంగి,)
గీ॥ యాతఁ డిచ్చటఁ జేరిన । యంతలోన,
నేను బలికినశపథముల్ । నిర్వహింతు॥ చెలియ॥ 65

టీ. "ఓపంకజాక్షి=ఓతామరసలోచనా! కమలాక్షు వాతెఱన్=వెన్నుని

యధరంబును, కసి తీఱన్ నొక్కి=మత్సరముతీఱునట్లు క్షతముచేసి, పగఁదీర్చుకొందున్=నావిరోధమును బాపుకొందును,చంద్రవదన=ఓ చంద్రునివంటి మోము గలదానా!చన్మొనలనె, ఉరస్థలమున్=నాథునిఱొమ్మును, నొప్పించి=బాధించి, నాచలము సాధింతున్=నాకోపమును సాధించుకొందును. మందయాన=మెల్లనినడకలుగలచెలీ! అక్కునన్=ఱొమ్మున, బిగన్ జేర్చి=బిగువుగాచేర్చి, అలయికన్ గ్రమ్మించి=అలసటనుగలిగించి,మచ్చరమ్మీడేర్తున్=నాక్రోధమును కొనసాగించుకొందును, వాఁడిచూపులన్ జూచి=చుఱచుఱమనిచూచి,వరునిన్ వేఁడఁగన్ చేసి=నాథుని ప్రార్థించికొనునట్లుచేసి, కోమలాంగి=లలితాంగీ! కోర్కులఁబోషింతున్=కోరికలను గాపాడికొందును. అతఁడిచ్చటఁ జేరినయంతలోనన్=అతఁడిచేటికి వచ్చినతోడనే, నేను బలికినశపథముల్=నేను చెప్పిన పంతములను, నిర్వహింతున్=సాధింతును.

తా. ఓచెలీ! వెన్నునిమోవిని నాకసిదీఱనొక్కి నాపగఁదీర్చుకొనెదను. నాకుచములనతనియురమున మెఱమి బాధించి నాచలమును సాధించుకొనెదను. అతనిని నాయక్కునఁజేర్చుకొని,యలయించి నా కతనియెడఁ గల్గినమత్సరంబును కొనసాగించుకొనెదను. చుఱచుఱ చూపులతో నతనిని జూచి, నన్ను ప్రార్థించుకొనునట్లు చేసికొనెదను. అతఁడిచోటికి వచ్చినతోడనే చూడుము, నాపలికినశపథముల నన్నిటిని సాధించుకొనెదను.

సీ॥ బలువిడి బోయఁడై ✽ పగలుసాధించు నే
మీనధ్వజుని కెంత ✽ మిడికిపాటె!
గబ్బిచన్గవలపై ✽ ఘనసాయకంబులఁ
గ్రుమ్మువీనికి నేమి ✽ దిమ్మ వట్టె?
మర్మ(స్థలంబంట) ✽ మఱి తూపులేయునే?
తనయింటిపైఁ గీడు ✽ దలఁచుద్రోహి
పతులను బాసిన ✽ భామల నేఁచు నే
యాఁడుతోడునఁ బుట్టఁ ✽ డమ్మ వీఁడు

గీ॥ దలిరుఁబోణులయుసు రింత ♦ దాకదయ్యె
విభుఁడు రాఁడని దెలిసి, నా♦వెంట నంటె॥ చెలియ॥ 66

టీ. బలువిడిన్ = అధికముగా, బోయఁడు ఐ=వ్యాధుఁడై, పగలు సాధించునే=విరోధములు కొనసాగించుచున్నాఁడు. మీనధ్వజునికిన్ =మన్మథునికి, ఎంతమిడికిపాటె=ఎంతగర్వమే, ఘనసాయకమ్ములన్ =తీక్ష్ణంబులౌ బాణములను, గబ్బిచన్గవలపైన్ గ్రుమ్మన్ =మదించినగుబ్బలమీఁదుగా గ్రుమ్మును,వీనికి నేమిదిమ్ము పట్టెన్ =వీనికేమిమదముగలిగెనే, మర్మస్థలంబంటన్ =గుట్టుపట్టునుదవులునట్లు, మఱితూపులేయునే=మఱిమఱి బాణంబు లేయుచున్నాఁడు.తనయింటిపైన్ = తనజన్మగృహమందు,కీడున్ తలఁచు ద్రోహి=తలఁచునట్టిద్రోహచింతగలవాఁడు, పతులను బాసినభామలన్ = పెనిమిటులనుండి తొలఁగినకామినులను, ఏఁచునే= హింసించునే, వీఁడు=ఈమన్మథుఁడు, ఆఁడుతోడునఁబుట్టడమ్మ= స్త్రీలతోడ జన్మించినవాఁడుగాఁడమ్మ, తలిరుఁబోణులయుసురు=ఆఁడుపాపము;ఇంతతాఁకదయ్యెన్ =కొంచెమైనను వీనిని అంటదు, విభుఁడు, రాఁడు, అని, నావెంటఁదవిలెన్ =నన్ను వెంబడించెను.

తా. వ్యాధునివలె పగలు సాధించుచున్నాఁడమ్మ. ఈమన్మథునకు నెంతగర్వమే. ఱొమ్ములపై క్రూరాస్త్రములను వేయుచున్నాఁడు. వీనికెంత గర్వము. ఏమని చెప్పుదును? విరహిణీజనములను బాధించువీఁడేమి యాఁడుతోడునఁ బుట్టినట్లు దెలియఁబడదు. అయ్యో! వీనికి ఆఁడువాండ్రయుసురు కొంచెమయినను దాఁకదేమి? విభుఁడు రాలేఁడు అని తెలిసి మఱింత నన్ను వెంబడించుచున్నాఁడు.

సీ॥ (వాసుదేవుని వివి ♦ వక్షోరుహంబులు)
వీనిపై బాణముల్ ♦ వేయఁబోకు,
నామానధనము శ్రీ♦నాథున కిచ్చితి
నీఁక బోఁకముడి వీఁడ ♦ నేయఁబోకు,
మతనికిఁ దనయుండ ♦ వౌదువు నీకు నేఁ

దల్లిని నాపేరుఁ దలఁపఁబోకు,
జనని తిట్టినతిట్టు చయ్యనఁ దగులును
గుణహీనతను దిట్లు గుడువఁబోకు,
గీ॥ మనుచు మరుఁడనుద్రోహి నేమనిన వినఁడు
వావి యెఱుఁగనియాపాపవర్తనుండు॥ చెలియ॥ 67

టీ. ఇవి వక్షోరుహంబులు=ఈకుచములు, వాసుదేవునివి=నీతండ్రియగు విష్ణుదేవునివి, వీనిపై బాణముల్ వేయఁబోకు=వీనిమీఁదుగా బాణములను వేయకుము. నామానధనముర్=నాయొక్క వ్రీడాధనమును, శ్రీనాథునకుర్ ఇచ్చితిని=శ్రీపతికొసఁగితిని. ఇఁకర్=ఇంకమీఁద, పోఁకముడిర్=నీవిని, వీఁడ నేయఁబోకు=వీఁడిపోవునట్లు ఏయకుము. అతనికిర్ తనయుండవు ఔదువు=అతనికి పుత్త్రుఁడవు అగుదువు. నీకు నేను తల్లిని; నాపేరుర్ తలఁపఁబోకు=నాపేరెత్తకుము. జనని తిట్టినతిట్టు=తల్లి దూషించినదూషణము, చయ్యనర్ తగులును=శీఘ్రమున తాఁకును. గుణహీనతను=దుర్గుణములనుగలిగి, తిట్లుకుడువఁబోకుము=దూషణములను దినకుము. అనుచుర్=ఇట్లనుచు. మరుఁడు అనుద్రోహిని=మన్మథుఁడు అనెడిద్రోహచింతగలవానిని, ఏమనినర్ వినఁడు=ఏమిచెప్పినప్పటికిని వినఁడు, వావియెఱుఁగని=భాంధవ్యమును దెలిసికొనని, ఆపాపవర్తనుండు=ఆదుష్కార్యములను చేయువాఁడు.

తా. ఇవి మీతండ్రివైన వక్షోరుహంబులు. ఈమానధనము వెన్నునిదిగాన కుచములమీఁదను నీవీబంధము మోచనము అగునట్లును బాణములేయకు. అతనికి పుత్త్రుఁడవు. ఏను నీకు జననిని. తల్లి తిట్టిన నీకుఁదప్పక తగులును. ఏలదుర్గుణివై తిట్లుతినెదవు? అనుచు ఆపాపిని ఎంత దూషించినప్పటికిని వినఁడమ్మ.

సీ॥ కడుబీదకును బెద్దకొక త్రియుఁ గలదుగా,
నాకులు విరు లమ్ము లాయెఁ గదర!
చెంచువానికినైన మించువి ల్లుండంగ,
నయ్యయో? తుంటవి ల్లాయెఁగదర!

కొఱగానివానికి ఽ గుఱ్ఱంబు లుండంగ,
నడవిచిల్కల నెక్క ఽ నాయెఁ గదర!
యాకృతు ల్ప్రాణుల ఽ కందఱ కుండంగ,
నంగహీనపుబ్రదు ఽ కాయెఁగదర!
గీ॥ చెడుగుబుద్ధుల నీవిట్లు ఽ సెడితి వంచు,
నెన్ని చెప్పిన మత్సరం ఽ బెచ్చెనమ్మ॥ చెలియ॥ 68

టీ. కడుబీదకును=మిక్కిలి బీదవానికిని, పెద్దకత్తియుఁ గలదుగా=పెద్ద ఖడ్గమనుప దొక్కటియుండునే, (నీకు) ఆకులు విరులు=చెట్లయాకులును పూవులును, అమ్ములాయెను గదా? (బీదకంటెను గర్భదరిద్రుఁడవుగదా నీవుఅనుట) చెంచువానికైనఁ=అడవిబోయకుకూడను, మించువిల్లుండఁగఁ=పెద్దధనువొకటి యుండఁగా, అయ్యయో! (నీకు) తుంటవిల్లు=చెఱకువిల్లు, ఆయెఁగదర-(చెంచుకంటెను నీవు హీనుఁడవనియర్థము) కొఱగానివానికిఁ=పనికిమాలినవానికిఁగూడ, గుఱ్ఱంబులుండంగఁ=వాహనములుండఁగా, (నీకు) అడవిచిల్కలఁ=అడవిలోనున్న చిలుకలను, ఎక్కనాయెఁ గదర=ఎక్కుట కాయెనుగదా! ప్రాణుల కందఱకుఁ=జీవకోట్ల కందఱికిని, ఆకృతులుండంగఁ=రూపములు ఉండఁగా, అంగహీనపు బ్రదుకు=శరీరములేని జీవనము ఆయెఁగదర, చెడుగుబుద్ధులఁ=చెడ్డబుద్ధులచేత, ఈవు, ఇట్లుచెడితివి అంచుఁ=నశించితివని, అన్ని చెప్పినఁ=అంత చెప్పినప్పటికిని, మత్సరంబు=మాత్సర్యము, ఎచ్చెనమ్మ=అధికమాయె. నమ్మ.

తా. ఓరిమన్మథా! నీకెంతదుర్గతి రా? మిగులబీదవానికిని ఖడ్గమొకటిగలదు నీకదిలేక ఆకులు పూవులేగద యాయుధములు. చెంచువానికిసైత మొకధనువుగలదు. నీకు చెఱకు విల్లాయెను. పనికిమాలినవానికిసైత మొక యశ్వముగలదు. నీకన్ననోఅడవిచిలుక వాహనమాయెను. లోకమునందలిసకలప్రాణులకును శరీరమన్నదిగలదు; నీవు శరీరప్రాప్తికిని ఇచ్చిపెట్టుకొన్నవాఁడవుగావు. ఇట్లు నీవుచెడినదంతయు నీదుర్బుద్ధివలననేగదా! యని నేనెన్నివిధముల వాని దూషించినను వానికి మాత్సర్యము అధికమాయెను గదమ్మ.

సీ॥ చిలుకనెక్కియు నెన్ని ♦ చేష్టలఁ జేయునే !
తురగమెక్కఁగను మై ♦ మఱచునేమొ?
తుంటవిల్ చేఁ బూనఁ ♦ ద్రుళ్లుపాట్లబ్బనే !
ధనువైన నెగిరిపోఁ ♦ దలఁచునేమొ?
ననవిరిశరముల ♦ గని విఱ్ఱవీఁగునే !
ఘనవజ్రమైనఁ ♦ గన్గానఁడేమొ?
కాయంబులేకయే ♦ కడుఁబోరుచుండునే!
మేనుగల్గినయంత ♦ మిడిసిపడునొ?
గీ॥ మగలఁ బాసిన స్త్రీలపై ♦ మచ్చరించి,
యేఁచఁ జొచ్చినమదనున ♦ కేటిలజ్జ॥ చెలియ॥ 69

టీ. చిలుకనెక్కియున్ = పక్షిని ఎక్కియును, ఎన్ని చేష్టలఁ జేయునే = ఎన్ని పనులను జేయుచున్నాఁడే, తురగమెక్కఁగను = గుఱ్ఱమెక్కినయెడల (అనఁగా గుఱ్ఱమెక్కు యోగ్యతగలిగినయెడల,) మైమఱచునేమొ = దేహమే తెలియఁడో? తుంటవిల్ చేఁబూనన్ = చెఱుకు విల్లును చేతఁబూనినంతటనే, త్రుళ్ళుపాట్లు అబ్బనే = మిడిసిపడుటలు ఏర్పడెను. ధనువైనన్ = (లోకసామాన్యంబైన) ధనుస్సుగా నుండినయెడల, ఎగిరిపోఁదలఁచునేమొ = గాలికిగాలిగ ఎగిరిపోవలయునని యెంచునో? ననవిరిశరములన్ = చిగుళ్ళును పూలునుగానుండు బాణములను, గని విఱ్ఱవీఁగునే = చూచి గర్వించునే, ఘనవజ్రమైనన్ = దృఢమైన వజ్రాయుధముగా నున్నయెడల, కన్గానఁడేమొ = కండ్లతోఁగూడ చూడఁడేమొ, కాయంబులేకయే = శరీరంబులేకయే, కడుఁబోరుచుండునే = మిగుల పోరులు పెట్టుచుండునే, మేను గల్గినయంతన్ = శరీరమొకటి మాత్రమిచ్చినయెడల, మిడిసిపడునో = త్రుళ్ళిపడునో? మగలఁబాసిన స్త్రీలపైన్ = పురుషుల నెడఁబాసిన స్త్రీలయెడల, మత్సరించి = క్రోధించి, ఏఁచఁజొచ్చినమదనునకున్ = హింసింపఁదలపడిన మన్మథునికి, ఏటిలజ్జ = సిగ్గెక్కడిది.

తా. పక్షినెక్కియు నిన్ని చేష్టలను చేయుచో, వీనికి గుఱ్ఱమునెక్కు కాలము

వచ్చినప్పుడు శరీరమే మఱచిపోనో? తృణమువిల్లు ధరించియే త్రుళ్లునట్టివానికి, దివ్యధనువుదొఱకినయెడల నెగిరియే పోఁదలఁచునో? ఆకులును పూవులును బాణములుగాఁ గల్గియేవిఱ్ఱవీఁగునట్టివానికి వజ్రాయుధము దొఱకినయెడల,కండ్లే కనఁడో?శరీరములేకయే మిగుల పోరాడువీనికి దేహ మబ్బిన మిడిసిపడునో?విరహిణులను భాధించునీమదనునికి లజ్జయెక్కడిది.

సీ॥ నామీఁద నేయుసూనశరంబు లతనిపై
నెందుకువేయవ దేమి మార?
నావంటిదే యలనలినాక్షి దానిపై,
నిగురుఁదూపులవేయ వేమి మార?
యందఱ మొకసమ మాదుము దానిపై
నింత యక్కటికం బదేమి మార?
మగలను బాసిన మానినీమణులను
హీనత బాధించు టేమి మార?
గీ॥ యనుచు రోషమ్ముగా నెగ్గు లాడి విసివె
వానిక్రౌర్యంబు నాయెడ వదలఁడమ్మ॥ చెలియ॥ 70

టీ. నామీఁదన్ ఏయుసూనశరంబులు=నామీఁద బ్రయోగించునట్టి పువ్వుబాణంబులను, అతనిపైన్=అతనిమీఁదుగా, ఎందుకువేయవు=ఏల ప్రయోగింపవు? అదేమిమార = మన్మథా! అందులకేమికారణమో? అలనలినాక్షి = ఆతామరసనేత్ర, నావంటిదే=నన్నుఁబోలినదే, దానిపైన్ =ఆ నాపగదాని మీఁదుగా, ఏమిమార = మన్మథా! యెందులకు, ఇగురుతూఁపులన్ ఏయవు=చిగురుటాకుబాణంబుల నేయవు? అందఱమున్ ఒకసమమాదుము= మేమందఱము నీకొకటే, దానిపైన్ =దానిమీఁదుగా, అదేమిమార=మన్మథా! యది యేమి? ఇంతయక్కటికంబు=ఇంతదయ, ఏమిమార=ఏమిరామన్మథా! మగలఁ బాసినమానినీమణులను=విప్రలబ్ధలను, హీనత బాధించుట=నీచత్వబుద్ధితో నేచుట. అనుచు రోషమ్ముగాన్ =అనికోపముగల్గునట్లు, ఎగ్గులాడి=దూషించి, వి

నివెక్ =విసుగుఁజెందెను. నాయెడర్ =నాయందు, వానిక్రౌర్యంబుర్ =వాని క్రూరస్వభావంబును, వదలఁడమ్మ=విడువఁడమ్మ.

తా. నామీఁద ప్రయోగించుపుష్పాస్త్రములను మదనా! ఏల విభునిమీఁద ను బ్రయోగింపవు; ఓరిమారా! అదేల నన్నుఁ బోలిన దేగద యానలినాక్షియు ను, దానిపై నెందుకు బాణప్రయోగంబుసల్పవు? మేమందఱమును నీకుఁ దుల్య ల మే! అదేలరా మదన! దానిపై నీకింతదయావిశేషము? మదనా? అదేలరా విరహిణీజనములను దక్కువచూపునుజూచి హింసించుట?అని నేనువాని నెన్ని విధంబుల దూషించినప్పటికిని, వానిక్రూరభావమే మెు నాయందు చూపుచు నే యుండువాఁడు.

సీ॥ మగవాఁడవై సరిమగవాండ్రఁ బోరక,
యాఁడువారల నేఁతు వటర మదన!
వీరులపై శరవేగంబు సూపక,
యాఁడువారల నేఁతువటర మదన!
ప్రమథేశుఁ డాఁకి వైరము దీర్చుకోలేక,
యాఁడువారల నేఁతు వటర మదన!
మాగోప్యసీమ నీమందిరం బై యుండ,
నాఁడువారల నేఁతు వటర మదన!

గీ॥ యయ్యయో! యింతసిగ్గు లే దయ్యె నసుచు,
అట్టుఁ జేసిన వానికి రాదు బుద్ధి॥ చెలియ॥ 71

టీ. మగవాఁడవై =పురుషుఁడవై యుండియు, సరిమగవాండ్రర్ =నీవసము లైన పురుషులతో, పోరక=కలహింపక, మదన=మన్మథా! ఆఁడువారలర్ ఏతువఁటర= స్త్రీలనుహింసింతువటరా? వీరులపైర్ =శూరులమీఁదుగ, శర వే గంబుర్ చూపక =నీబాణములపటుత్వమును జూపక, ఆఁడువారలర్ ఏతువఁట రమదన! ప్రమథేశుర్ =ఈశ్వరుని, తాఁకి=ఎదుర్కొని, వైరముర్ తీర్చుకో లేక =నీపగను సాధించుకొనఁజాలక, ఆఁడువారలర్ ఏతువటరమదన!మాగోప

సీమ నీమందిరంబై యుండఁగా =మాగుట్టుపట్టులు నీయునికిపట్లుగా నుండఁగా, ఆఁడువారలఁ ఏఁతువటురమదన! అయ్యయో=అయ్యో, ఇంతసిగ్గు లేదయ్యెఁ = స్వల్పమయినను సిగ్గురాదనుచు, అట్టుచేసినఁ =ఆఱడి వెట్టినను, వానికిరాదుబుద్ధి= వానికి బుద్ధిరాదు.

తా. ఓమన్మథుఁడా! నీవు మగవాఁడవై యుండియును సరిమగవాండ్రతో పోరాడక ఆఁడువారి నేఁచుటయేమిపని? నీశరవేగమును వీరులపైఁ జూపక నారులపైఁ జూపుట యొకపౌరుషమా? ఈశ్వరు నంతటివానితోఁ బోరియును పగను సాధించుకోలేనినీవు నబలలపైని యేమిరవైరము? మాగోప్యసీమలు నీ గృహములై యుండఁగా మమ్మునే యేఁచుట పాడియా? అయ్యో! నీకేలర యింతైనను సిగ్గు రాదు అని యెంత ఆఱడి వెట్టినను వానికిబుద్ధిరాదు.

సీ॥ వేఁడెద నినుఁ గోరి ‡ వేఱు పల్కను మార!
పయ్యెద నెదమీఁద ‡ వెయ్యనీర!
మ్రొక్కెద నిదె పోఁక ‡ ముడి వీడెరా మార!
కట్టుఁగొంగైనను ‡ గట్టనీర!
విన్నవించెద నీకు ‡ విరితూపు లేయకు
మొగాయములనైన ‡ మాననీర!
బతిమాలి విసిఁగితి ‡ బడలినానుర మార!
తఱు చైనయలుకలఁ ‡ దఱలనీర!
గీ॥ మనవి చేకొను మ్రొక్కెద ‡ మార మార!
యన శరవర్ష మంతంత ‡ నతిశయించె॥ చెలియ॥ 72

టీ. మార=ఓమన్మథా! నినుఁ గోరివేఁడెదను=నిన్నే దలఁచి ప్రార్థించెదను, వేఱుపల్కను=మాఱుమాట్లాడను, పయ్యెదఁ =పైఁటను, ఎదమీఁదఁ =ఱొమ్ములపైని, వేయనీర=వేయనిమ్మురా, మార=ఓమన్మథా! మ్రొక్కెదఁ ఇదె=ఇదో నమస్కరించెదను, పోఁక ముడివీడెరా=నీవీబంధమువదలెనురా. కట్టుకొంగైనను=లోఁపలికొంగు నైనను, గట్టనీర=కట్టుకోనిమ్మురా, నీకు విన్నవించెదఁ =

నీకు విజ్ఞప్తి చేసికొనెదను, విరితూపులు ఏయకు=పూలబాణములను ప్రయోగిం పకుము, మైగాయములైనన్=శరీరమునందు దిదివఱ కేర్పడిననీబాణమ్ములవలని గాయములైనను, మాననీర=ఆఱనిమ్మురా. మార=మదనుఁడా! బతిమాలి విసిఁగితిన్=నిన్ను వేఁడికొని రోఁపుచెందితిని, బడలినానుర=అలయికను జెందితినిరా, తలుచైన యలుకలన్=గాఢమయిన ప్రణయకోపమునుండి, తఱలనీర=మఱలనిమ్మురా, మారమార=ఓమన్మథా! మన్మథా! (ఇచటి పునరుక్తిసంప్రార్థనంబును దెలుపునది,) మనవిచేకొను=నావిజ్ఞాపనమును గైకొనుము. మ్రొక్కెదన్=నమస్కరించెదను, అనన్=ఇట్లెంత చెప్పినను, శరవర్షము=బాణవృష్టి, అంతంతకున్ = అంతకంత, అతిశయించెన్=అధికమయ్యెను.

తా. ఓరీమన్మథా! నిన్నిదే వేఁడెదను, ఱొమ్ములపై పయిఁటను వేయనిమ్ము. పోఁకముడి వీడెను, కట్టుకొంగునైనను చుట్టుకొననిమ్ము. ఊఱక యేల బాణములేసెదు, ఇదివఱకేర్పడిన గాయములయినను మాననిమ్ము. నిన్నూఱక వేఁడికొని వేఁడికొని బడలితిని. విసిఁగితిని. ఓరీమారా! మారా!! చాలును నీయుద్వృత్తి-నామనవి వినుము; మ్రొక్కెదను అని యెంత వేఁడినను వానిశరవృష్టి అధికమయ్యెనుగదమ్మ.

సీ॥ ప్రాణేశు కౌఁగిటఁ । బాయ కుండిననాఁడు,
దుష్ట! నీవిల్లేడ । తునియలయ్యె?
మగఁడు నాపైఁ జాల । మమత నించిననాఁడు,
నీమార్గణము లేడ । నీళ్లఁ గలిసెఁ?
గవకూడి పతి నేను । గడు సుఖించెడునాఁడు
చెడుగ! నీబల మేడ । చెట్లఁ గలిసె?
వేఁడుక రతి నన్ను । విభుఁడు గూడెడునాఁడు,
నీధ్వజరాజ మే । నీటఁ బడియె?
గీ॥ నోరిమన్మథ ! నే నొంటి । నున్నవేళ
వేయవ ద్దనఁగాఁ దూపు । లేయు నమ్మ॥ చెలియ॥ 73

టీ. దుష్ట=ఓదుష్కార్యరతుఁడవైనమార! ప్రాణేశుకౌఁగిటన్ =జీవితేశుని కౌఁగిలియందే, బాయకుండిననాఁడు=ఎడఁబాయక వసించియున్నప్పుడు, నీవిల్లేడతునియలయ్యెన్ =నీధనువుతునిఁగి పాడొందియుండెనో?మగఁడు=పురుషుఁడు,నాపైన్ చాలమమత నించిననాఁడు=నాయెడల మిగులప్రీతి నించియున్న కాలమందు,నీమార్గణములేడ నీళ్లఁగలిసెన్ =నీబాణములు నీళ్లఁగలిసియుండెనో? (అనఁగా చెఱుకుతునియ లగుటయు పూలునీళ్ళనుండుటయు సహజములని యభిప్రాయము.)కవన్ కూడి=జంటగా,పతి నేను= పెనిమిటియును నేనును, కడుసుఖించెడునాఁడు=మిగులసౌఖ్యములఁ దేలునట్టిసమయమునందు, చెడుగ=దుర్బుద్ధీ! నీబలము ఏడచెట్లన్ కలిసెన్ =నీసేనలన్నియును చెట్లపాలయియుండెనో, (మదనునిసేనలు=శుకములుకోకిలము మొదలగునవి.ఇవి చెట్లవసించుట సహజము. వీని దూషణముగా చెప్పుట కవియొక్కచమత్కారము.) విభుఁడు=నాయకుఁడు, వేడుకన్ =ఉత్సాహాతిశయముతో, రతిన్ కూడెడునాఁడు=క్రీడలుసలుపువేళ యందు, నీధ్వజరాజము=నీశ్రేష్ఠమయినధ్వజము మీనము. (అదినీటవసించుట స్వాభావికము.) "ఓరిమన్మథ!ఏనుఒంటినున్నవేళన్ = నేనొంటరిగానున్నపుడు, తూఁపులువేయన్ వద్దు=బాణములను ప్రయోగింపకుము." అన్నన్ =అన్నను,ఏయునమ్మ=బాణములను ప్రయోగించునమ్మ.

తా. ఓరీదుష్కార్యరతుఁడవైనమారా! నాథునియాలింగనమునందే యనవరతమును నేను లాలింపఁబడుచుండిననాఁడు నీవిల్లుతునియలయిపోయియుండెనో? మనోహరుఁడు ప్రేమతో ననుఁ గాంచుచున్న కాలములందు నీబాణములు నీళ్ళఁబడియుండెనో? నాప్రియుఁడు జతకూడి నాతోడ రతిసౌఖ్యములఁ దేలుచున్న కాలములయందు నీసేనలన్నియుఁ జెట్లపాలయియుండెనో? యప్పుడు నీపతాకము ఏనీళ్లపాలయి యుండెను? నేను ఒంటరిపాటుననున్నప్పు డానీశౌర్యము? వలదు, "బాణములేయవలదు." అని నేనెంతగాఁ జెప్పినను వాఁడేయు బాణములను వేసియే తీఱుచున్నాడమ్మ.

సీ॥ నినుఁజూడ రోసిగా  నీచుఁడ ! నీతండ్రి
యవతారములఁ దాల్చి  నవనిఁ జేరె,

నినుఁ గన్న పిదప నొందినయపకీర్తికై
యెచ్చిన కార్చిచ్చుఁ జొచ్చెఁ దల్లి,
నీమాట వినలేక నిర్మోహపాశ యై
ప్రాణికోటులనోళ్లఁ బడియె వదినె,
నినుఁ గొన్న పగచేత నీయన్నతలఁ బట్టి
కోపంబుచే శూలి కొట్టివైచె,
గీ॥ ననుచు సిగ్గంతఁ గడిగి ద్రోహముల నెన్న
మత్సరం బెచ్చి తనయోజ మానలేఁడు॥ చెలియ॥ 74

టీ. నీచుఁడ=ఓయల్పుఁడా! నినున్ చూడను రోసిగా=నిన్నుఁ జూడ రోఁతఁ జెందికదా, నీతండ్రి=నీజనకుఁడైన వెన్నుఁడు, అవతారములన్ తాల్పన్=పుట్టుకలను జెంద, అవనిన్ చేరెన్=భూమిని చేరెను. నినుఁగన్నపిదపన్=నీవు జనించినవెనుక, ఒందినయపకీర్తికై=నీజన్మమువలన సంభవించినయపయశంబునకై, తల్లి=నీజనని యగులక్ష్మిదేవి (సీత) ఎచ్చినకార్చిచ్చున్ చొచ్చెన్=అధికమయిన సొదను ప్రవేశించెను. (అగ్ని ప్రవేశము చేసెను అనుట.) నీమాట వినలేక=నిన్నుఁ గూర్చినయపకీర్తిని వినఁజాలక, వదినె=నీయన్న యగు బ్రహ్మదేవుని భార్యయగు సరస్వతి, ప్రాణికోటులనోళ్లన్ పడియెన్=జనులచే దూషితయాయెను. (వాగ్రూపిణిగా వెలసెను అనుట) నినుఁ గొన్న పగచేతన్=నీయెడ వహించిన విరోధముచేత నేగదా! నీయన్న తలన్ పట్టి=బ్రహ్మదేవునిశిరమును బట్టి, కోపంబుచేన్=క్రోధవశమున, శూలి=శూలధరుఁడగు శివుఁడు, కొట్టివైచెన్=ఖండించివైచెను, అనుచున్=ఇట్లనుచు, సిగ్గున్ అంతన్ కడిగి=వానిసిగ్గును అంతటిని కడిగి గాలించి, ద్రోహముల నెన్నన్=వానిదుష్కార్యములను గణింపఁగా, మత్సరంబు ఎచ్చి=క్రోధము మఱింతయధికమయి, తనయోజన్=తనరీతిని, మానలేఁడు=వదలలేఁడు.

తా. (ఇచ్చట వర్ణింపఁబడినవన్నియును, మన్మథునికి సంబంధములేకుండియును సంబంధముడునట్లుగాఁ గల్పించి చెప్పఁబడెనుగాన అలంకారము కవి

(ప్రౌఢోక్తి) ఓరిమన్మథా! నీవు రోసియేగదా! నీజనకుఁడు అవతారవ్యాజమున భూమిని జేరెను, నిన్నుఁ గన్నందులకే గద నీతల్లి యగ్నిప్రవేశము చేయవలసి వచ్చెను. నీయుపకీర్తివలననేగద నీవదినె శారదాదేవి సకలజనులవాత పడెను. నీవలననే గద నీయన్న శిరము శూలి ఖండించెను. అని వాని సిగ్గునంతటిని గడిగి గాలించినప్పటికిని మఱింతకోపము హెచ్చి తనపనిని వదలుకొనకున్నాఁడుఁగదే!

సీ॥ నీకుఁ గేతనమాట ♦ నీచత్వ మనికదా?
వడిగ చావున కొప్పి ♦ వలనుబడుట,
నీకు బలంబౌట ♦ నీచత్వమనికదా?
నగుఁబాటు లనక కా ♦ నలను బడుట,
నీకుఁ దా విల్లౌట ♦ నీచత్వ మనికదా?
తెగువలకోర్చి గా ♦ నుఁగులఁ బడుట,
నీకు బాణములౌట ♦ నీచత్వ మనికదా?
పవమాన సంగతి ♦ నవనిఁబడుట,

గీ॥ యిన్నిఁటికి సిగ్గు రాఁగ నీ ♦ కేల రాదు;
మార! యిఁకఁ బోరవల దన్న ♦ మానఁ డమ్మ॥ చెలియ॥ 75

టీ. (మత్స్యములు) నీకుఁ గేతనమాట=నీ టెక్కెమునందుఁ బోలుచుట, నీచత్వము=లఘుత్వము, అనికదా=అనియెంచియేకద, చావునకుఁ ఒప్పి = మరణించుటకైనను తలపడి, వలనుబడుట=బెస్తలు పన్నినవలయందుఁ బడి చచ్చుట. (పక్షులు) నీకుబలంబౌట=నీకు సేనగా చేర్పడుట, నీచత్వమనికదా! నగుబాటులు అనక=పరిహాసాస్పదము అనియెంచక, కానలను=అడవులను, పడుట=పొందుట. (చెఱకు) నీకు విల్లగుట=నీకు విల్లయి యపఖ్యాతిని జెందుట, నీచత్వమనికదా! తెగువలకుఁ ఓర్చి=సాహసములకోర్చి, గానుఁగలను పడుట. (పుష్పములు) నీకు బాణములౌట=నీకు అమ్ములగుట, నీచత్వమనికదా! పవమానసంగతిఁ =గాలిదెబ్బలను, అవనిఁ పడుట=భూమికి ద్రెళ్లుట. ఇన్నిటికిఁ = నీపరివారపరికరములన్నిటికిని, సిగ్గు రాఁగఁ = సిగ్గు గలుగఁగా, మార! నీకేల రాదు=నీకేల సిగ్గు

కలుగదు. ఇఁకన్ పోరవలదు=ఇంకపోరాడకు, అన్నన్ =అనియెంత చెప్పినను, మానఁడమ్మ=తనపనిని వదలఁడమ్మ.

**తా.** ఓరీమన్మథా! నీకుధ్వజమగుటకంటె చచ్చుటమేలనిగదా మీనములు వలయందుపడుట; నీకుబలమగుటకంటె నీచత్వమొకటిలేదని యెంచికదా పక్షులు పరిహాసములకయిన నోర్చి యడవిపా లగుట; నీకువిల్లగుటకంటె హీనత మఱొకటిలేదని తలఁచికద చెఱుకు తెగించి గానుఁగులలోఁబడి నశించుట; నీకు బాణములుగ నుండుటకంటె హీనతయొండులేదని భావించికదా పుష్పములు గాలిదెబ్బకు భూమిని ద్రెళ్లుట; మన్మథా! యిన్ని నీపరివారపరికరంబులకు సిగ్గు వచ్చినప్పుడు నీకేలర రాదు, అనియెంతచెప్పినను దనపనిని మానఁడుగదే. (ఇదివఱకును మన్మథోపాలంభనము-ఇఁక చంద్రోపాలంభనంబునకు మొదలు పెట్టినది.)

సీ॥ భామల నిట్లేఁచఁ బట్టెగదా చంద్ర!
నీలోఁ గలంకంబు నిలిచిపోయె,
తరుణులయుసు రట్లె తాఁకికదా చంద్ర!
దిగ్దేశములఁ జెడి తిఱుఁగవలసె,
తెఱవల నెల్ల బాధింపఁగాఁ గద చంద్ర!
దినదినంబును గళల్ దీసిపోవు,
నబలలు నీరాక కడలఁగాఁ గద చంద్ర!
రేయిఁ జోరుఁడ వై చరింపవలసె,
గీ॥ రాజ వయి స్త్రీలఁ బోరాడ రాదటంచు,
నెన్నిఁజెప్పిన మత్సరం బేల మాను॥ చెలియ॥ 76

టీ. చంద్ర=ఓయిందుఁడా! భామలన్ ఇట్లుఏఁచన్ పట్టెకదా=స్త్రీలను ఇట్లు హింసింపఁదలపడికదా! నీలో కలంకంబు=నీయందు అపయశము (కళంకము), నిలిచిపోయెన్ =దక్కిపోయెను. చంద్ర! తరుణులయుసురు=స్త్రీలపాపము, అట్లెతాఁకికదా=అట్లు నిన్నుఁ జేరినందునఁగదా, చెడి=స్థితి చెడి, దిగ్దేశములన్

తిఱుఁగవలసెన్ =దిక్కునుండి దిక్కుకుఁ దిఱుఁగవలసివచ్చెను. చంద్ర! తెఱవల నెల్లన్ = స్త్రీలనందఱిని, బాధింపగాఁగద=హింసింపఁగాఁగద! దినదినంబును కళల్ తీసిపోవున్ =దినమునకు దినము నీకు కళానష్టము గలుగును. చంద్ర! అబలలు=కాంతలు, నీగాకకున్ =నీవచ్చుటకు, అడలఁగాఁగద=దుఃఖించుటచేత నే గదా! రేయిన్ =రాత్రికాలమందు, చోరుఁడవౌచున్ చరింపవలసెన్ =దొంగవలెఁ దిఱుఁగవలసివచ్చెను, రాజవయి=ప్రభువవయి (చంద్రుఁడవయి), స్త్రీలన్ పోరాడరాదు=ఆఁడువారితోఁ బోరాటము పెట్టుకొనరాదు. అటంచున్ =అని, ఎన్ని చెప్పినన్ =ఎంత చెప్పినను, (వాఁడు,) మత్సరంబెలమానున్ =మాత్సర్యము నెందుకు వదలును?

తా. చంద్రుఁడా! నీవు స్త్రీలను హింసించుటంబట్టియే గదా! నీలో కలంకము నిలిచియేపోయెను. నీవుదిక్కునుండి దిక్కుకు చెదిరి పాఱవలసివచ్చెను. దినదినమునకును కళానష్టము కలుగుచువచ్చుట. రాత్రులయందు దొంగవలె తిఱుఁగులాడుట. 'రాజు' అను పేరును గలిగి స్త్రీలను బాధించుట యేటిన్యాయమురా! వలదు, అని యెంత చెప్పినప్పటికిని, ఓసఖీమణీ! తనక్రోధమును మానఁడుగదమ్మ.
(ఇఁక మలయానిలమును ఉపాలంభించుచున్నది.)

సీ॥ మగువల నేఁచుట ꞏ మారుతమా చూడు
మెపుడు నిల్వక పఱుఁ ꞏ గెత్తవలసె,
నువిదల బాధింప ꞏ నోపవనా! చూడు
మేఁటిపాములు నిన్ను ꞏ మ్రింగవలసెఁ,
గాంతల బాధింపఁ ꞏ గాఁ దెమ్మెరా! చూడు
మట్టె నీకడుపునఁ ꞏ బుట్టెకోఁతి,
గరితల నెరియింపఁ ꞏ గా సమీరా! చూడు
బహుదేహములు సొఱఁ ꞏ బడుట లాయె,
గీ॥ ననుభవించియు నీస్థితు ꞏ లరయ వీవు.
మాను మన్న స్వభావంబు ꞏ మానఁడమ్మ॥ చెలియ॥ 77

టీ. మారుతమా=ఓమలయానిలుఁడా! చూడుము, మగువలన్ ఏఁచుటన్ = స్త్రీలను వ్యధ పెట్టుటచేత నే, ఎపుడు నిల్వక పఱుఁగెత్తవలసెన్ = కాలూనిన చోట నిలుచుటకుఁగాక పఱుఁగులు పెట్టవలసియున్నది. ఓపవనా! చూడుము. ఉవిదల బాధింపన్ = స్త్రీలను ఏఁచుటచేత నే, మేఁటిపాములు నిన్ను మ్రింగవలసెన్ = పాములకు నీవు తిండివైయైతివి. తెమ్మెరా! చూడుము. కాంతలన్ బాధింపఁగాన్ = స్త్రీలనుహింసించుటచేత, కోఁతి నీకడుపునన్ అట్టె పుట్టెన్ = ఆంజనేయస్వామి వానరముగా నీకుదయించెను. సమీరా=ఓవాయుదేవుఁడా! చూడుము గరితలన్ ఎరియింపఁగాన్ = స్త్రీలను మంట పెట్టుటచేత, బహుదేహములు సొఁబడుట లాయెన్ = అనేకశరీరములందు వ్యాపించియుండవలసి వచ్చెను, ఈస్థితులు=ఈగతులను, అనుభవించియున్ =పొందియును, అరయవు=నీవు దెలియవు. మానుము=వదలిపెట్టుము; అన్నన్ =అనిచెప్పఁగా, స్వభావంబున్ =తన సహజగుణమును, మానఁడమ్మ=వదలఁడమ్మ.

తా. ఓపవమానుఁడా! విను. నీవు స్త్రీలను హింసించుటచేత నే, సదాగతివైయైతివి. పాములు నిన్ను మ్రింగుచున్నవి. నీకడుపున వానరము పుట్టెను. నీవు సకలశరీరములయందుఁ జొచ్చి వచ్చుచున్నావు. ఇన్నిగతులు నీకుఁ గలుగుటలనుగూర్చి నీవు విచారింపవు. వదలిపెట్టుము. అని సఖియరో మారుతునిఁగూర్చి యెంత చెప్పదును. వాఁడేమొ తనసహజగుణమును వదలఁడుగదే.

సీ॥ బొట్టుగట్టినపతి ఽ పోఁ ద్రోయు చుండఁగాఁ,
పత్తులఁ దిట్టిన ఽ ఫలము దేమి?
మగఁడు నామీఁద స ఽ మ్మతి లేక యుండఁగాఁ,
బవనుని దూషింప ఽ భాగ్యమేమి?
సరసుఁడు చలమిట్లు ఽ సాధించు చుండఁగాఁ,
బుష్పాస్త్రుఁ దెగడినఁ ఽ బుణ్యమేమి?
అతిప్రియతముఁ డిట్లు ఽ మతి నెన్న కుండఁగా?
చంద్రుని నిందింప ఽ సౌఖ్యమేమి?

గీ॥ చెలువుఁడీలాగు నన్నిట్లు ♦ సేయుచుండఁ,
వారివారిని దిట్టిన ♦ వచ్చునేమి॥ చెలియ॥ 78

టీ. బొట్టుఁ గట్టినపతి=మాంగల్యమును గట్టినపెనిమిటి, పోఁ ద్రోయుచుండఁగాఁ=తిరస్కారము చేయుచుండఁగా, పక్షులఁ దిట్టినఁ ఫలమదేమి=పక్షులనుదూషించుటవల్లఁ గల్గుప్రయోజనమేమి? మగఁడు, నామీఁదఁ, సమ్మతిలేక యుండఁగాఁ=ఇష్టములేకుండునప్పుడు, పవనునిదూషింపఁ=గాలిని తిట్టుటచే, భాగ్యమేమి=ఏమిభాగ్యము వచ్చును. సరసుఁడు=రసికుఁడు, చలము ఇట్లు సాధించుచుండఁగాఁ=కోపమును ఇట్లు కొనసాగించుచుండఁగా, పుష్పాస్త్రిఁ=మారుని, తెగడినఁ=ఉపాలంభించుటచేత, పుణ్యమేమి=ఏమిసుకృతము? అతిప్రియతముండు=మిగులహితుఁడు, ఇట్లు=ఇవ్విధముగా, మతినెన్నకుండఁగాఁ=మనస్సులో గణింపకుండునప్పుడు, చంద్రుని నిందింపఁ=చంద్రదూషణముచేత, సౌఖ్యమేమి=ఏమిసుఖము, చెలువుఁడు=విభుఁడు, ఈలాగు=ఇవ్విధముగా, నన్నిట్లు చేయుచుండఁ=నన్నిట్లు అన్యథాకరించుచుండఁగా, వారివారిని తిట్టినఁ; వచ్చునేమి=ఏమిలాభము గల్గును?

తా. బొట్టును కట్టిన పెనిమిటియే వదలియుండునప్పుడు, పక్షులను, పవమానుని, మారుని, సోముని, దిట్టుటలచేతఁ బ్రయోజనంబేమి?

సీ॥ వానివౌశరములు ♦ వడిగఁ దిట్టెదమన్న
నవి యందఱకు యోగ్య ♦ మైనవిరులు,
వానిబలంబుల ♦ వడిగఁ దిట్టెదమన్న
చెట్లకొమ్మల వసించు ♦ జీవకోట్లు,
వానిగేహము పాడు ♦ పడఁ దిట్టుద మటన్న
మనమానములె వాని ♦ మందిరములు,
వానినే పాడు గా ♦ వడి దిట్టుదమటన్న
నన్నేలు శ్రీహరి ♦ చిన్నికొడుకు,

గీ॥ తెలిసె నిఁకమీఁద నంగజుఁ దిట్టరాదు
వల పెఱుంగనివిభు ననవలెను గాని॥ చెలియనీవేగి॥ 79

టీ. వాని వాశరములన్ =మన్మథునిబాణంబులను, వడిగన్ తిట్టెదమ న్నన్ =శీఘ్రముగా శపియింతుగా! యని తలఁచినచో, అవి=ఆబాణములు, అందఱకును, యోగ్యమైన=యుక్తమయిన, విరులు=పువ్వులు, వానిబలంబులన్ = వానిసేనలను, వడిగఁదిట్టెదమన్నన్, అవి=ఆపక్షిగణములు, చెట్లకొమ్మలన్ = చెట్లశాఖలపై, వసించుజీవకోట్లు=వాసముచేయు ప్రాణిలోకము, వానిగేహముపాడుపడన్ =వానియిల్లు కూలునట్లుగా, వడిగఁదిట్టుదము అన్నన్, మనమానము లె=మనగుట్టుపట్టులే, వానిమందిరములు=వానియిండ్లు, వానినే పాడుగాన్ = వాఁడే నశించిపోవునట్లు, వడిగఁదిట్టెదమన్నన్, నన్నేలుశ్రీహరి=నన్నురమించునట్టి శ్రీనివాసమూర్తియొక్క, చిన్నికొడుకు=ముద్దులకొడుకు, తెలిసెన్ = తెలియవచ్చెను. ఇఁకమీఁదన్ =ఇఁకను, అంగజున్ =మారుని, తిట్టరాదు=దూషింపరాదు. వలపెఱుంగనివిభున్ = నామోహమును గనుఁగొననిపతిని, అనవలెనుగాని=దూషింపవలెనుగాని.

తా. మన్మథుని బాణమును దిట్టుదమన్ననో! అవియందఱిచేతను ఆదరింపఁబడు పుష్పములు, వానిబలములను దిట్టుదమన్ననో! పాపము! అవి తరుశాఖలవసించుపక్షిగణము. వానిగృహమును దిట్టుదమన్న మనగోప్యసీమలే వానిమందిరములు. వానినే దిట్టుదమన్న వాఁడు నాజీవధనమయిన శ్రీనివాసమూర్తికి ముద్దులకొమరుఁడు. తెలిసెను. నామోహమును గనుఁగొనని విభుననవలెనుగాని, యింక, సఖీమతల్లి! మదనుని దూషింపరాదుసుమీ.

సీ॥ తలిదండ్రులను బాసి దా నొకరింటిలో
బెఱిఁగినవానికిఁ బ్రేమ గలదె?
మాటమాత్రన మేనమామను జంపిన
కఠినాత్మునకు నేల కరుణ పుట్టు?
జారచోరులు గాంచు జాడలమెలఁగెడు

పలుగాకి కిపుడేల భ్రమలు పుట్టు?
నాఁకఁట నెంగిలి నైన రోయక తిను
దుర్బుద్ధి కేలాగుఁ దోఁచు మమత?
గీ॥ ఇట్టివాఁడని మావారి కెఱుక లేక
యిచ్చినప్పుడు గుణదోష మెంచనేల॥ చెలియ॥ 80

టీ. తలిదండ్రులను బాసి=కన్నవారిసతొలఁగి, తాను ఒకరింటిలోన్ =తాను అన్యులయింటియందు, పెటిఁగినవానికిన్ =వర్ధిల్లినవానికి, ప్రేమ గలదె=ప్రియము పుట్టుకొనివచ్చునా? మాటమాత్రన = ఒకమాటకే, మేనమామను జంపిన కఠినాత్మునకున్ =మామయైనకంసుని వధించిన కష్టహృదయునకు, ఏలకరుణ పుట్టున్ =దయయేలగలుగును? జారచోరులు=విటులును దొంగలును, కాంచుజాడలన్ మెలఁగెడుపలుగాకికిన్ =పోవునట్టిరీతులను పోవుపలువకు, ఏలభ్రమలుపుట్టున్ =తనకామినిని ఏలభ్రమనొందికాంచును. ఆఁకఁటన్ =ఆఁకలివేళలందు, ఎంగిలినైనన్ =కుడువఁగామిగిలిన యన్నమునైనను, రోయకతిను దుర్బుద్ధికిన్ =విసుఁగుజెందక తినునట్టి చెడుగునకు, మమతలేలాగుతోఁచున్ =ప్రీతియెట్లు గానఁబడును? ఇట్టివాఁడు=(శ్రీహరి) యిన్నిపోకలుగలవాఁడు, అనిమావారికిన్ ఎఱుకలేక=అనిమాతల్లి దండ్రులకు జ్ఞానములేక, ఇచ్చినప్పుడు=నన్నొసఁగినప్పుడు, గుణదోషములన్ = మేలుసెబ్బరలను, ఎంచనేల=ఏలగణింపవలెను?

తా. పుట్టినప్పుడే తల్లిదండ్రులను బాసి ప్రవాసముచే వర్ధిల్లినవానికిఁ బ్రేమ యెక్కడిది? తన మేనమామను కంసుని మాటమాత్రముననే వధించిన కఠినహృదయునకు కరుణారసం బెక్కడిది? జారచోరశిఖామణికి పత్నీవ్రతం బెక్కడిది? భుక్తశేషమును సైతముభుజించు స్వామికి మమతయెక్కడిది? యిట్టివాఁడుఅను పరమజ్ఞానము చేత నిర్ణయింపఁజాలక మూఢులయి నన్నొసంగిరే, పిమ్మట గుణదోషసంభావనంబులవలనప్రయోజన మేమి?

సీ॥ గోవులఁ గాయఁగా గోపాలుఁ డితఁ డని
వెంపటిఁ బిలిచెడి పేరు గలిగె,

వసుధలోఁ బలఁ జంద్రవంశసంభవుఁడౌట
విటివి యాతులముకుఁ గఱయుఁ గలిగె,
మేఁటిబలాఢ్యులు మిత్రులై యుండియు
రాజ్యాధిపత్యంబు పూజ్యమయ్యె,
నలజోగిగములకు నణఁగినవాఁడౌట
కేవలమా నపకీర్తి గలిగె,
గీ॥ నిట్టివాఁడని గుణముల నెన్నుచున్న,
సిగ్గు తలయెత్తనీ దేమి సేతునమ్మ॥ చెలియ॥ 81

టీ. గోవులఁ గాయఁగాఁ = ఆవులను మేఁపుటచే, గోపాలుఁడితఁడని= గోవులను పాలించువాఁడితఁడని, పెంపఱఁ పిలిచెడి పేరు గలిగె=గౌరవము నశించునట్లుగా పిలుచునట్టి పేరు గలిగెను. వసుధలోఁ పలఁ = భూమండలము నందు, చంద్రవంశసంభవుఁడౌటఁ =(సకలంకుఁడగు)చంద్రునియొక్క వంశంబు నందు జన్మించినవాఁడగుటచేత, విటివి యాతులముకుఁ =గొప్పవంశమునకు, కఱయుఁగలిగెఁ =(కలంకము) మలినముగలిగెను. (కలంకముగలవానివంశమును గలంకము తోఁడిదేయని) మేటిబలాఢ్యులు=బలాధికులైన ధర్మరాజాదులు; మిత్రులైయుండియుఁ = స్నేహితులై యుండియును,రాజ్యాధిపత్యంబు=ఏలుబడి, పూజ్యమయ్యెఁ =శూన్యమాయెను. అలజోగిగములకుఁ = జోగులగుంపుకు, (యోగీశ్వరేశ్వరులకు) అణఁగినవాఁడు ఔటఁ =లొంగినవాఁడగుటచేత,అనఁగా భక్తపరాధీనుం డగుటంబట్టి, కేవలమా=మిగుల హైన్యమైన, అపకీర్తి గలిగెఁ =అపయశము సంభవించెను, (జనులు) ఇట్టివాఁడని=ఇట్టియోగ్యతగల వాఁడని, గుణములనెన్నుచున్నఁ =గుణములను లెక్కపెట్టుచుండఁగా, సిగ్గు తలఁ ఎత్తనీదు=సిగ్గు తలను వంచుచున్నది, ఏమి సేతునమ్మ=ఓ చెలీ! యేమి చేయుదునే.

సీ॥ తల్లిదండ్రులయింటఁ దనపొట్ట పూఁడక
గొల్లయై గోవులఁ గోరి కాచె,

నంతటనైనఁ బేరాఁకలి దీఱక
లీల వెన్నను దొంగిలింప సాగె,
కట్టుబట్టలు లేక కాంతలు వదలిన
యంశుకంబులఁ బొంచి యపహరించె,
జారచోరతమీఱి సంచరించుచు నుండి
చెట్టుకుఁ దల్లిచేఁ గట్టఁబడియె,
గీ॥ ననుచు నీవల వింటినే యమ్మ చెల్ల,
మున్నె యెఱిఁగిన నేనేల మోసపోదు॥ చెలియ॥ 82

టీ. తల్లిదండ్రులయింటన్ =తనపితలయింటియందు, తనపొట్టపూడక=తనక డుపునిండక, గొల్లయై=పసులకాఁపరియై, గోవులన్ కోరికాచెన్ =ఇష్టపడి ఆవులను మేఁపెను, అంతటన్ అయినన్ =అందుచేతను, పేరాఁకలితీఱక =తనయధికక్షుత్తుతీఱక, లీలన్ =విలాసముగా, వెన్నను దొంగిలించెన్ =నవనీతమునుదొంగిలింపసాగెను, కట్టన్ బట్టలులేక=ధరించుకొనుటకు వస్త్రములులేమిచే, కాంతలు వదలినయంశుకంబులన్ =స్త్రీలుగట్టి వదలినబట్టలను, అపహరించెన్ =దొంగిలెను, జారచోరతన్ = విటుఁడుగాను దొంగగాను, మీఱిసంచరించుచున్ =(న్యాయమునకు) అతిశయించితిరుఁగుచు, చెట్టుకున్, తల్లిచే కట్టఁబడియెన్ = తల్లివలనఁ జెట్టుకు కట్టఁబడెను, అమ్మచెల్ల=ఆశ్చర్యము! అనుచున్ ఈవలవింటినే=ఇటీవలవిన్నదాననే! మున్నెయెఱిఁగినన్ =ముందుగాఁ దెలిసియుంటినేని, నేనేలమోసపోదున్ = నేను మోసముపోయియుండనుగదా!

తా. తన్నుఁగన్నవారియింటియందు తనపొట్టనునిండింపకొనఁజాలక గొల్లయైపసులనుగాసెను, అంతటితోనైనను దనయాఁకలిని దీర్చుకోఁజాలక, వెన్ననుదొంగలింపసాగెను. కట్టుబట్టలకు నైతము గతికానక స్త్రీలబట్టల నపహరించెను, తల్లి చెట్టుకుఁ గట్టునట్లుగా జారచోరులతో మెలఁగసాగెను, అమ్మా! ఇట్టివాఁడని మొదటనె తెలిసియుండిన నేనేల మోసపోదును.

సీ॥ సిగ్గింతయును లేక । చెల్లెలికై దాను
గుంటెనవాఁడైన । కొంటె యితఁడు,
తన మేనమామను । దయ యింతయును లేక
ద్రుంచివైచిన గొప్ప । ద్రోహి యితఁడు,
జనకునితోఁ బుట్టు । చనరాదు నాక యా
రాధను బొందిన । వ్రాత్యుఁ డితఁడు,
కులసతీమణు లింటఁ । గోరి చరింపఁగాఁ
బరభామలను బొందు । పాపి యితఁడు,
గీ॥ అనుచుఁ జెప్పట నిజమయ్యె । నతివలార!
యిట్టికఠినాత్ముఁ డిక నన్ను । నేఁచఁ డటరె॥ చెలియ॥ 83

టీ. తాను=శ్రీకృష్ణుఁడు, సిగ్గు ఇంతయున్ లేక=స్వల్పమయినను సిగ్గులేక, చెల్లెలికై=సహోదరియగు సుభద్రకై=కుంటెనవాఁడు, కూర్చిపెట్టువాఁడు, అయిన కొంటె ఇతఁడు=అగునట్టిదుష్టుఁడు ఇతఁడు, దయయింతయును లేక=కొంచెమయినను అక్కటికము లేక, తన మేనమామను=తనతల్లితోఁబుట్టు వగుకంసుని, ద్రుంచివైచిన=చంపివేసిన, గొప్పద్రోహి యితఁడు=అధికద్రోహచింత గలవాఁడితండు, జనకునితోఁబుట్టు=తండ్రితోడఁబుట్టినది, చనరాదు నాక=పోవకూడదు అనక, రాధను=రాధికను, గూడిన వ్రాత్యుఁడితఁడు=చేరిననీచుఁడితఁడు, కోరి=తన్నుకోరి, కులసతీమణులు=భార్యలు, ఇంటన్ చరింపఁగాన్=ఇంటియందు మెలఁగుచుండఁగా, పరభామలను పొందు పాపి యితఁడు=ఇతర స్త్రీలనుగూడునట్టిపాపియితఁడు, అనుచున్ చెప్పట=అనిజనులాడుట, అతివలార=స్త్రీలార! నిజమయ్యెన్=యథార్థములయ్యెను, ఇట్టికఠినాత్ముఁడు=ఇట్టిదుష్టుఁడు, నన్నేఁచఁడటరె=నన్ను హింసింపకుండునా.

తా. చెల్లెలికిఁగాను తాను సిగ్గునువదలి కుంటెనతనమునకు లోఁబడెను. తన మేనమామ కంసుని దయలేక చంపెను. తండ్రితోఁ బుట్టినదగురాధికతోడఁ బాపమునుదలపోయకయే కూడెను. భార్య లింట మెలఁగుచుండఁగా నన్య స్త్రీ

లతోఁ పొందిక నలుపును. ఇట్టికొంటెకును, ద్రోహికిని, వ్రాత్యునకును, పాపికిని, మార్దవహృదయముండునో? అట్టివాఁడు నన్నెట్టు లేఁచకుండును?

సీ॥ ఎప్పుడే నల్గఁగా ౹ నింట నుండెడివాఁడు
దిన్నఁగా నలుకల ౹ దీఱసాఁగె,
పలుకక సైఁగలఁ ౹ బనులు సెప్పెడివాఁడు
చెప్పకమును పనుల్ ౹ సేయసాఁగె,
కొదువల నెన్నుచుఁ ౹ గోపగించెడువాఁడు
పడఁతి కోపింపఁ దా ౹ నడలసాఁగె,
మ్రొక్కి వేఁడినగాని ౹ మోడి మాననివాఁడు
పెక్కులు బతిమాలి ౹ వేఁడసాఁగె,

గీ॥ వలపుమందులు దలకెక్కి ౹ వలచెఁగాక,
లేక యుండిన వాఁడేల ౹ రాకమాను॥ చెలియ॥ 84

టీ. ఎప్పుడున్ ఏను అలుఁగఁగాన్ = ఎప్పటికిని నేను కోపించుచుండఁగా, ఇంటనుండెడివాఁడు = నాయింటియందే పడియుండువాఁడు, తిన్నఁగాన్ = మెల్లఁగా, అలుకలన్ దీఱసాగెన్ = కోపములను గడిదేఱెను, పలుకక సైఁగలన్ = మాటలాడకయే సంజ్ఞలచేత, పనులుచెప్పెడివాఁడు = పనులను చెప్పునట్టివాఁడు, చెప్పకమును = నేనుచెప్పుటకుఁబూర్వమే, పనుల్ సేయసాగెన్ = చెప్పుటకుమునుపే పనులుచేయుటకు మొదలుపెట్టెను, కొదువలన్ = తక్కువలను, ఎన్నుచున్ కోపగించెడివాఁడు = భావించుచును కోపము చేయువాఁడు, పడఁతికోపింపన్ = ఆ స్త్రీయలుకచెందఁగా, తాను, అడలన్ సాగెను = దుఃఖింపసాగెను, మ్రొక్కివేఁడినన్ కాని = నమస్కరించి ప్రార్థించిననేగాని, మోడిన్ మాననివాఁడు, పెక్కులుబతిమాలి వేఁడసాగెన్ = అనేకవిధముల బతిమాలి ప్రార్థించుకొనసాగెను, వలపుమందులు దలకెక్కన్ = దానిప్రయోగించు వశీకరణౌషధంబులు తలవఱకు వ్యాపింపఁగా, వలచెనుగాని, లేకయుండినన్ = అట్లుగాకుండిన, వాఁడేలరాకమానున్ = వాఁడేల రాకయుండును.

తా. ఇచ్చట ధీరాధీర నాయిక గావర్ణించు చున్నవాఁడు-ధీరాధీరలక్షణము- "అలిగివాచాయుక్తి, నన్నుఁటదండించు ప్రౌఢధీరాధీర ప్రాభవమున" అని పతిని సర్వవిధంబులను దండించుసామర్థ్యము గలనాయిక, ఎప్పుడయినను నేనుఅలుఁగఁగా ఇంటియందే పడియుండువాఁడు తిన్నఁగా తా నలుఁగుటకు తీఱినవాఁడయ్యెను. పలుకక సంజ్ఞలచేత నే పనులనుజెప్పువాఁడు, ఆ చేడియ చెప్పకముందే తాను బనులు సేయసాగెను, ఎప్పటికిని కొదువలను ఎన్నుచు కోపగించుకొనువాఁడు ఆపడఁతి కోపగింపఁగా వ్యథపడసాగెను, మ్రొక్కి వేడుకొన్న నేగాని మోడివదలనట్టివాఁడు అనేకవిధంబులను దాని బతిమాలసాగెను, అతఁడేమిచేయును. అదిపెట్టినమందులు తలకెక్కెను, అట్లు లేకున్న అతఁ డిచటికి రాక మానునా?

సీ॥ పొరుగింటి కేలాగు ♦ పోతివిరా! యంచు
జడఁగొద్దిఁ గొట్ట నా ♦ కెడదరాదు
మాపు లాయింతితో ♦ మాట లాడితి వంచు
మూఁతులు వ్రేఁడుప నా ♦ చేతఁ గాదు,
దక్కినమగనిచే ♦ మ్రొక్కించుకొనియెదు,
చాతురినేర్పు నా ♦ చేతఁ గాదు,
రతిఁగోరి పతి నన్ను ♦ బతిమాలుకొనఁజేయు
చేతలవగలు నా ♦ చేతఁ గాదు,
గీ॥ గనుకఁ దా నందు నున్నాఁడు ♦ కరుణలేక
యట్టినడవడి నాచేత ♦ నౌనఁటమ్మ ॥ చెలియ॥ 85

టీ. పొరుగు ఇంటికిన్ =ఇతర స్త్రీ యింటికి, "ఏలాగు పోతివిరా" అంచున్ = ఏవిధముగా పోయినావఁటరయని, జడకొద్దికొట్టన్ =జడనుకొనికొట్టుటకు, నా కెడదరాదు= నాకుమనసురాదు, ఆయింతితోన్ =ఆ స్త్రీతో, మాఁపులు= రేలు మాటలాడితివంచున్ =మాటలాడితివిగాయని, మూఁతులువ్రేఁడుపన్ =బుగ్గలుపొడుచుటకు, నా చేతఁగాదు, దక్కినమగనిచేతన్ =తనకు వశ్యుఁడయినపురుషుని

చేత, మ్రొక్కించుకొనియెదు=నమస్కరింపఁజేసికొనెదు, చాతురి నేర్పు నాచేతఁగాదు=చాతుర్యముతోడి నేర్పు నాచేతకాదు. రతిఁగోరి=క్రీడలనపేక్షించి, పతి=విభుఁడు, నన్ను బతిమాలుకొనఁ జేయుచేతలవగలు=నన్ను వేఁడుకొనునట్లు చేయించు పనులయొక్క వింతలు, నాచేతఁగాదు. గనుక=కాఁబట్టియే, కరుణలేక=దయలేక, తానుఅందున్నాఁడు=తానచ్చట సేవసించుచున్నాఁడు, అట్టినడవడి=అట్టిచర్య, నాచేతఁ జౌనఁటమ్మ= నేను చేయుటకగునా?

తా. పొరుఁగింటి దానిపొందేలరా నీకు, అని జడలతో వ్రేటుపాటులను చూపుటకు నాచేత కాదు. రేలు ఆయింతితో మాటలేమిరా! యని బుగ్గలుపొడవ నాకు మనస్సురాదు. లోఁబడిన పెనిమిటిచేత దండములను బెట్టించుకొను చాతురి నాకు లేదు. పతి రతినికోరి నన్ను బతిమాలికొనునట్లు చేయించుటకు నావల్లఁగాదు. కాఁబట్టియే నాయందు కరుణ లేక, యందువసించుచున్నాఁడు. అట్టినడవడికలు నాకువచ్చునమ్మ?

సీ॥ కులగోత్రములు రూపు గుణము మానము లేని
వానికి నన్నీయ వచ్చునఁటరే?
నీఁటుగఁ బాముపై నిద్రించు మాయల
వానికి నన్నీయ వచ్చునఁటరే?
యెల్లజోగులమనం బిల్లుగాఁ దిరిఁగెడు
వానికి నన్నీయ వచ్చునఁటరే?
వావివర్తనబంధు వర్గంబు లేనట్టి
వానికి నన్నీయ వచ్చునఁటరే?
గీ॥ యిట్టివానికి మావార లిచ్చినపుడె?
వడ్లతోఁ దట్ట యెండఁగా వలసివచ్చె. ॥చెలియ॥ 86

తా. కులగోత్రములు రూపు గుణము మానము లేని=(నిర్గుణబ్రహ్మమునకు కులము గోత్రము ఆకారము సత్వాదిగుణముల పరిమాణముఇవి లేవనుట.) సత్కులమును, వంశమును, అందమును, సద్గుణమును, సిగ్గును లేనట్టివానికిన్, నన్నున్ ఈయ

వచ్చునంటరె=నన్నొసంగవచ్చునా? నీటుగన్ =అందముగా, పాముపైన్ = (శేషాహిపై) పాముమీఁదుగా, నిద్రించుమాయలవానికిన్ = నిదురఁజెందు మోసగానికి, నన్నీయవచ్చునంటరె, ఎల్లజోగులమనంబు=(యోగీశ్వరుల హృదయము) బిచ్చగాండ్రమనస్సులే, యిల్లుగా తిటిగెడువానికిన్ =నివాసముగా చరించువానికి, నన్నీయవచ్చునంటరె, ఇట్టివానికి మావారలిచ్చినపుడె= మా పెద్దలు ఇట్టివానికిచ్చినకాలమందే, పడ్లతోన్ తట్ట యెండఁ గావలసివచ్చె=వడ్లుఎండునప్పుడు దానిని వహించినతట్టయును ఎండవలసిన సామ్యము ఏర్పడెను.

తా. కులగోత్రములు మొదలగువాని లేనివానికి ఎట్లు మా పెద్దలియవచ్చును. పాముపై నిద్రించుమాయలానికి మా పెద్దలొసంగవచ్చునా? జోగులమనసుకువచ్చినవాని కెట్లు మా పెద్దలు నన్నీయవచ్చును? వావివర్తనలు లేనట్టివానికి నన్నిచ్చుట యుక్తమఁటరె ? యిట్టివానికి మావారొసఁగుటచేత నేగదా పడ్లతోడ తట్ట యెండునట్లు కష్టము లనుభవింపవలసివచ్చెను.

సీ॥ మరుశరవృష్టిచే ꠰ మాలేమ దాళక
 విరహాగ్ని వెతలను ꠰ వేఁగె ననవె?
వేఁగించుచో మోము ꠰ వెలవెలఁ బోవుచు
 చిడిముడిచే శయ్యఁ ꠰ జేరె ననవె?
చేరి తానటు చలించి త్తయి వాకిట
 నీకై నిరీక్షించి ꠰ నిలుచు ననవె?
నిలిచి నీరాకలు ꠰ నిక్కముల్ గామికి
 మించినతమిఁ దత్తరించె ననవె?
గీ॥ తత్తరంబున జీవముల్ ꠰ దాళవనుచు
 నెనరుగాఁ దెల్పఁజాలిన ꠰ నెలఁత వీవు ॥చెలియ॥ 87

టీ. మరుశరవృష్టిచేన్ = మదనునిబాణపాతములకు, మాలేమ తాళక=మాపడుచు ఓర్వనిదై, విరహాగ్ని వెతలను వేఁగె ననవె=విరహవేదనలపరితపించెననుమా? వేఁగించుచోన్ =హింస లొందునప్పుడు, మోము వెలవెలఁబోవుచున్ = మొ

గము వెల్లనగుచు, చిడిముడిచేఁ=తొట్రుపాటుచే, శయ్యఁ జేరెననవె=పడు కను జేరెనసుమీ, అటుఁ జేరి=అట్లుచేరి, తాను చలచిత్తయై=చలించుమదిగలదై, వాఁకిటఁ=వీథిగుమ్మమునొద్ద, నీకై నిరీక్షించి=నీకై యెదురుచూచి, నిలుచుననవె=నిలుచునని చెప్పుమా, నిలిచి, నీరాకలు=నీవువచ్చుటలు, నిక్కముల్ గామికిఁ=నిజముగానందుకు, మించినతమిఁ=అతిశయించిన తమకముచే, తత్తరించుననవె= తొట్రిలు ననుమీ, తత్తరంబునఁ=తొట్రుపాటుచే, జీవములూర్చనుచుఁ=ప్రాణవాయువులు ఓర్చియుండవనుచు, నెనరుగాఁ=కృతజ్ఞతతో, తెల్పఁజాలిన నెలఁతవు=తెలుపఁగలిగినదానవు. ఈవు=నీవు.

తా. మన్మథబాణపాతములకు మగువ దాళఁజాలక విరహాగ్నిచే వేఁగుచున్నదనుము. గ్లానిభావముచే మోముతెల్లనను జెంది శయ్యనుపొందుననుము. స్థిరచిత్తకాక చిడిముడిపాటుతో, వాఁకిట నీకై నిరీక్షించుచుండుననుము. అట్లు నిలిచి, నీరాక నిజముగామికి, తమితత్తరంబుల ననుభవించు ననుము. తత్తరములదాని జీవమ్ములెట్లోర్చి నిలువఁగలదని చెప్పుము. నెనరూని నాకై చెప్పఁగలిగినదాన వీవగుటచేత, త్వరితముగాపోయి చెప్పి కృష్ణుని తోడితెమ్ము.

సీ॥ విరితూపులను గల్గుకవెతల నీవియెఱుంగు
మేటివెన్నెలకాఁక కేమె నెఱుంగు,
చనుఁగవపొగరులకేసడిరైక యెఱుఁగును
తమితమకంబు చిత్తంబెఱుంగు,
కడువడి మైకాఁక కట్టువల్వయెఱుంగు
కలఁగి వేసటపాటు గండ్లెఱుంగు
నచ్చోటి పులకల కనఁ బెందొడ లెఱుఁగు
మఱిమఱికోర్కుల మన మెఱుంగు.

గీ॥ మీకుఁ దెలియునో నావెత ల్నాకుఁదెలియుఁ
దడవు సేయక నీవతిత్వరితముగను॥ చెలియ॥ 88

టీ. విరితూపులను గల్గువెతలఁ=పుష్పబాణములవలనిబాధలను, నీవియె ఱుంగుఁ=పోలఁకముడి యెఱుఁగును, మేను=దేహము, మేఁటివెన్నెలకాఁకఁ=అధికమయిన చంద్రునివలనితాపమును, ఎఱుంగుఁ=తెలియును, చనుఁగవపొగరులనడిఁ=చండ్లజంటయొక్క గర్వమువలనిరచ్చను, రైకయెఱుఁగు=కంచుకంబుదెలియును. చిత్తము, తమి=తహతహపాటులయొక్క, తమకంబుఁ=ఉద్రేకమును, ఎఱుంగుఁ=తెలియును. కడువడిఁ=మిక్కిలిగా, మైకాఁకఁ=దేహమునందలి యుష్ణమును, కట్టువల్వయెఱుంగుఁ= కట్టిన చీరకుఁదెలియును. కలఁగి=కలఁతనుజెంది, వేసటపాటుఁ=వేసరిపడుటలను, కండ్లెఱుంగుఁ=కండ్లకుఁ దెలియును. అచ్చోటిపుల్కలఁ=ఆస్థలమునందలిగగుర్పాటులను, అన్నఁ=అన్నచో, పెందొడ లెఱుంగుఁ=పెద్దతొడలకుఁ దెలియును, మనము=మనస్సు, మఱిమఱి=పలుమఱు, పుట్టుకొని వచ్చునట్టి, కోర్కలఁ ఎఱుంగుఁ=కోరికలనెఱుఁగును. మీకుఁ దెలియునో=మీకేమి దెలియును? నావెతల్నాకుఁ దెలియుఁ=నాహింసలు నాకుగా తెలియును. కాఁబట్టి, తడవుసేయక=ఆలస్యపఱచక, నీవు; అతిత్వరితముగఁ=మిగుల వేగముగా, (పోయి శ్రీకృష్ణునితోడుకొని రమ్ము.)

తా. నానిర్బంధమునకుఁ గదా పుష్పబాణములవలని వ్యథ దెలియును! మేనుకుగా తెలియును వెన్నెలకాఁకవలని తీవ్రత! రైకకు తెలియును చనుఁగవ పొగరులనడి! మనస్సునకేగాని తమకమువలని తహతహలు దెలియునా? నాశరీరముయొక్క కాఁక నాకట్టుబట్టే దెలియును. నాకండ్లకు నా వేసటపాటు దెలియును. నాకోర్కెలు నాహృదయమునకుఁ దెలియును. మీకేమియెఱుక? నాహింసలు నాకుగా తెలియును. కాఁబట్టి యాలస్య పఱచక త్వరితముగా శ్రీకృష్ణుని తోడికొనిరమ్ము.

సీ॥ ప్రాణేశుఁ డూరికిఁ బయనమై పోవంగఁ
దోడఁబడి యెదు రౌచుఁ దుమ్మనైతి,
నది యెంత కాదని యశ్రద్ధఁ జేసిన
బోరానిదిన మని బొంకనైతి,

నాకెపై మరు లున్న । దని యేఁగఁజూచిన
నడ్డమై నిలిచి పో । రాడనైతి,
కపటమైత్రిని జూపి । కదలిపోఁజూచిన
పొంచి నే మఱి వెంబ । డించనైతి,
గీ॥ నీయుపాయంబు లానాఁడె । యెఱిఁగియున్న,
వెఱ్ఱిదానన నే నేల । విడుతు నతని॥ చెలియ॥ 89

టీ. ప్రాణేశుఁడు=విభుఁడు, ఊరికిన్ పయనమై పోవంగన్=దేశాంతరమునకుఁ బ్రయాణపడునపుడు, తోడఁబడి=పూని, ఎదురొచుఁదుమ్మనైతిన్=ఎదురుతుమ్ము తుమ్మకపోతిని, అదియెంత=ఆతుమ్మెంతమాత్రము, అనఁగాఁ (దుమ్మటవల్లనగు నపశకున మేమాత్రము)అని, అశ్రద్ధఁజేసినన్=నిర్లక్ష్యము చేసినయెడల, పోరానిదినము =సుదినము కాదు, అని బొంకనైతిన్=అని యబద్ధము లాడనైతిని. ఆకెపైన్=ఆయిల్లాలి మీఁదుగ, మరులున్నదని=మోహమున్నదియని, ఏఁగఁజూచినన్=పోఁజూడఁగా, అడ్డమునిలిచి=త్రోవ కడ్డుపడినిలిచి పోరాడనైతిన్. కపటమైత్రిని జూపి=కపటస్నేహమును జూపి, కదలిపోన్ జూచినన్=జరుఁగుటకు ప్రయత్నించిన యెడల, నేను, పొంచి=కాఁచుకొని యుండి, మఱి వెంబడించనైతిన్=వెన్నంటి పోనైతిని, ఆనాఁడె=ఆదినమునందె, ఈయుపాయంబు లెఱిఁగి యున్నన్=ఈయుక్తులను దెలిసికొని యుండినయెడల, వెఱ్ఱిదాననె=నేను వెఱ్ఱిపట్టినదాననో? అతనిన్=విభుని, ఏల విడుతున్=ఎందుకు వదలిపెట్టుదును?

తా. కాంతుఁ డూరికని ప్రయాణ మగునపుడు అపశకునముగా తుమ్మనైతిని. దానిని లక్ష్యము సేయక యతఁడు కదలి పోవఁజూచెనో, ఇది ప్రయాణమునకు నర్హము కానిదినమని బొంకనైతిని. దానిమీఁద మరులున్నదని పోఁజూచునపుడు అడ్డుపడి పోరాడనైతిని. కపటస్నేహమును జూపి కదలిపోవుటకుంకింపఁగా వెంబడియే వెళ్లనైతిని. ఆదినమునకే యీయుపాయంబులన్నియును దెలిసి యుండినయెడల నేనేమి వెఱ్ఱిదాననో విభుని విడిచిపెట్టి యుండుటకు?

సీ॥ జంటఁబాయక పైఁడికంటులు దిఱుఁగఁగాఁ
    జూడ నామది కెంతొ వేఁడు కయ్యె,
వెంటిపై మరులూని వెన్నాడుమృగములఁ
    జూడ నామది కెంతొ వేఁడు కయ్యె,
రతిబంధములచిత్రరచనలప్రతిమలఁ
    జూడ నామది కెంతొ వేఁడు కయ్యె,
కవఁగూడి సతిపతుల్ గలసి పెనఁగుటల్
    విన్న నామది కెంతొ వేఁడు కయ్యె,
గీ॥ నెట్టిజంతువులందైన నెవరికైన,
విభులు మగువల నిట్లేఁచ వింటిరఁటరె॥ చెలియ॥ 90

టీ. పైడికంటులు=పైడికంటులనుపక్షులు, జంటఁబాయక = జోడువీడక, తిరుఁగఁగాఁ=సంచరించుచుండఁగా, చూడఁ = (ఆపక్షులదాంపత్యసౌఖ్యమును) చూచుటకు, నామదికిఁ, ఎంతొ వేఁడుకయ్యెఁ=ఎంతోసంతోషము కలిగెను, పెంటిపైఁ = స్త్రీజాతిమృగముమీఁద, మరులు ఊని=మోహమును కలిగి, వెన్నాడుమృగములఁ=వెంటనంటుమృగములను, చూడఁ నామది కెంతొ వేఁడుకయ్యె, రతిబంధముల=క్రీడాబంధములతోడి, చిత్రరచనల ప్రతిమలఁ=చిత్రపటములయందలివిగ్రహములను, చూడ నామది కెంతొ వేఁడుకయ్యెఁ, సతిపతుల్=భార్యాభర్తలు, కవఁగూడి=జంటనుగూడి, కలిసి పెనఁగుటల్=కూడియాడి క్రీడలుసలుపుటలను. విన్నఁ నామది కెంతొ వేఁడుకయ్యె, ఎట్టిజంతువులందైనఁ=ఎటువంటిప్రాణులయందయినను, ఎవరికైనను=ఎట్టిమనుజులకైనను, విభులు=పతులు, మగువలఁ = స్త్రీలను, ఇట్లేచఁ=ఇట్లు హింసించుచుండఁగా; వింటిరఁటరె=విన్నారా.

తా. పైఁడికంటులు జంటఁబాయక తిరుగుటలను స్త్రీమృగముల వెన్నాడి మగమృగములు తిఱుఁగుచుండుటలను, రతిబంధములతోడి చిత్రపుబొమ్మలను జూచుటకు నామది కెంతో వేఁడుకలను గలిగించును, స్త్రీలు తన పెనిమిటు

లతోడ మన్మథయుద్ధములందు పెనఁగుటలను వినుటయును నామనస్సెంతో యానందమును జెందును, చెలియా ! ఇట్లు ఏప్రాణికోటియందైనను స్త్రీజాతిని హింసించుటలను వినియున్నావా?

సీ॥ మగని నేమఱక బల్ మమతల నుండెడి
సతు లెట్టివ్రతములు సలిపినారొ,
పతికి నెంతో ప్రాణపదముగా నుండెడి
వనిత లేవరములు వడసినారొ,
ప్రాణేశు కౌఁగిటఁ బాయక యేయుండు
నింతు లేదానమ్ము లిచ్చినారొ,
ప్రియునితో రతికేళిఁ బెనఁగుచు నుండెడి
చేడె లేధర్మముల్ సేసినారొ,
గీ॥ యేమి నేఁ గోరి నోచితి నిందువదన?
యలుక విభునికి నానాఁటి కతిశయించె॥ చెలియ॥ 91

టీ. మగనిన్ ఏమఱక=పురుషుని ఏమఱియుండక, మమతలన్ ఉండెడిసతులు=ప్రీతిమై యుప్పొంగెడి స్త్రీలు, ఎట్టివ్రతములు సలిపినారొ=ఎట్టినోములను నోచికొనిరో, పతికిన్=విభునికి, ఎంతో ప్రాణపదముగాన్ ఉండెడివనితలు=మిక్కిలి ప్రాణసమానమై యుండెడి స్త్రీలు, ఏవరములు పడసినారొ=ఎట్టివరములను పొందియున్నారో ? ప్రాణేశుకౌఁగిటన్ = మగనియాలింగనమునందే, పాయక యయుండునింతులు=ఎడఁబాయక వసించు స్త్రీలు, ఏదానమ్ములిచ్చినారొ=ఏవిధములయినమూసినవాయనములను పెట్టుకొనిరో? ప్రియునితోన్ = మగనితో, రతికేళిన్ పెనఁగులాడుచునుండునట్టికాంతలు, ఏధర్మముల్ చేసినారొ=ఎట్టిసత్కార్యములను చేసియుందురో ? ఇందువదన=ఓచంద్రముఖీ ! ఏమి నేను కోరినోచితిన్=ఎట్టిప్రయోజనమునుగూర్చి నోచికొంటినోగాని, విభునికిన్=కాంతునకు, అలుక=కోపము, నానాఁటికిన్ అతిశయించెన్=దినదినమునకు వృద్ధిచెందెడిని.

తా. మిగులఁ బ్రేమతో మగని నేమఱక జతకూడియుండునట్టి కాంతామణులు ఎట్టిసద్వ్రతములను దొలిజన్మములయందుఁ జేసినవారలో? మగనికి ప్రాణపదములుగా నుండునట్టిమగువలు దామే యుత్కృష్టవరములను బొందియుండువారలో? చిత్తేశు ఆలింగనమును వీడక సదా సుఖించునతీమణులు దామెట్టి మానవాయనములను పెట్టికొనరో? ఎడవిడక ప్రాణేశుని రతిబంధముల సుఖించునితంబినీమణు లెట్టివిశేషధర్మములను ఆచరించినవారలో! ఏమి గోరి నేను నోచినదాననోగాని, నావిభునికి అలుక నాయెడ సంభవించెను.

సీ॥ అతివల సారెకు నంపి వేసారితిఁ
ప్రత్యుత్తరంబైనఁ బలుకఁ డయ్యె,
వరుసఁగా ఖచితముల్ వ్రాసి పుత్తెంచితి
బాగుగా నవి చేతఁ బట్టఁడాయె,
ప్రియురాండ్రచేతఁ జెప్పించి వేసారితిఁ
గట్టడిమదిఁ జెవిఁ బెట్టఁడాయె,
నితరుల కే లంచ మిచ్చి నే బడలితి
నందులఁ బతి కల్కి లధికమాయె,
గీ॥ నతనియిటురాక లవి మిథ్య లమ్మలార!
నాతి! నాప్రియురాలిత నంబుఁ గనవె॥ చెలియ॥ 92

టీ. అతివలన్ = స్త్రీలను, సారెకున్ అంపి = పలుమాఱులును అంపి, వేసారితిన్ = బడలితిని, ప్రత్యుత్తరంబైనన్ = బదులుమాటలైనను, పలుకఁడయ్యెన్ = మాటలాడఁడాయెను. వరుసగాన్ = క్రమముగా, ఖచితముల్ వ్రాసి పుత్తెంచితిన్ = లేఖనముల వ్రాసిపంపినాను. బాగుగాన్ అని చేతఁబట్టఁడయ్యెన్ = పొందికతో వాని గ్రహింపఁడాయెను. ప్రియురాండ్ర చేతన్ = హితలయిన చెలులచేత, చెప్పించి వేసారితిన్ = సందేశములను విన్నవింపించి బడలితిని. కట్టడిమదిన్ = కఠినహృదయముచేత, చెవిఁబెట్టఁడాయెన్ = ఆదరించి వినఁడయ్యెను, ఇతరులకున్, నేను లంచమిచ్చి, బడలితిని, అందులన్ = అట్టిచేతలచేత, పతి

కిన్ = నాథునికి, అల్కలు = కోపములు, అధికమాయెన్ = అతిశయించెను, అమ్మ లార! అతనియిటు రాకలు = అతఁడిచటికివచ్చుటలు, అవిమిథ్యలు = అనునవియెంతయును సత్యములు గావు. నాతి = ఓచెలీ! నా ప్రియురాలితనంబున్ = నాయిష్టురాలి భావమును, కనవె = చూడవె.

తా. అమ్మలార! నాథునియొద్దకు పలుమాఱును చేడియలను అంపి వేసారినాను, బదులయినను చెప్పనో? అనేకజాబులనుకూడ పంపి బడలితిని; వానిని చేతికైనను దీసికొనునో? ప్రియురాండ్రచేఁ జెప్పించియును విసిఁగితిని. నాథుఁడు వానిని పెడచెవినిపెట్టును. ఇతరుల కెంతో లంచము లిచ్చినాను. అందువలన విభునికి మఱింతకోప మతిశయించెను. ఇఁక చిత్తేశునిరాకలుమిథ్యలు. కాఁబట్టి నీప్రియురాలితనము ప్రకాశించునట్లు తోయజాక్షీ నాథుని తెమ్ము.

సీ॥ మున్నువాఁ డొకనాఁడు నన్ను ముద్దిడు మన్న
మోమటు ద్రిప్పితి మోహనాంగి,
బతిమాలి 'పాలిండ్లఁ బట్టనీయవె' యన్న
కసరి కొట్టితి నమ్మ కంబుకంఠి,
కుసుమాస్త్రకేళిని గూడ రమ్మని వేఁడ
మాటాడనైతినే మంజయాన,
'యలుఁగకువే' యంచు నటు కౌఁగిటను దార్పఁ
దాళుకొమ్మంటినే ధవళనయన,

గీ॥ యాన లెఱుఁగని పాపాత్మురాలఁ గనుక,
ప్రాణపదమైనవిభు నెడఁ బాయవలసె॥ చెలియ॥ 93

టీ. మోహనాంగి = మోహనశీలమయినశరీరము గలదానా? మున్నొకనాఁడు = పూర్వమొకప్పుడు, నన్నుముద్దిడుమన్నన్ = నన్ను ముద్దుపెట్టుకొనుము అనఁగా, మోము అటుద్రిప్పితిన్ = ముఖమట్లు త్రిప్పినాను. బతిమాలి = వేఁడికొని, పాలిండ్లన్ పట్టనీయవే, అన్నన్ = అనఁగా, కంబుకంఠి, కసరికొట్టితిని, కుసుమాస్త్రకేళిని = మన్మథక్రీడలను, కూడన్ రమ్మనివేడన్ = చేరుటకు రమ్మనివేఁడ

గా, మందయాన! మాటాడనైతిఁ=బదులునైనను చెప్పకపోతిని, అలుఁగకువే=కోపగింపకుమా, అని, అటుకౌఁగిటనుదార్పఁ=అట్లు దాను కౌఁగిలించుకొనఁగా, ధవళనయన=తెల్లని నేత్రపద్మములను గలదానా! తాళుకొమ్మంటి నే=తాలుకొమ్ము అని చెప్పినానుగదవే; అనలెఱుఁగని పాపాత్మురాలఁ కనుక=ఆశలు దెలియని పాపినిగాఁబట్టి, ప్రాణపదమైనవిభుఁ=ప్రాణమునకు తుల్యుఁడైన పెనిమిటిని, ఎడఁబాయవలసెఁ.

తా. తొల్లి 'వాఁడొకప్పుడు'నన్ను ముద్దులిడుకోవే'' యనివేఁడగా మోము ద్రిప్పితిని. మఱొకప్పుడు పాలిండ్లను బట్ట నీయవేయనఁగా, కసరి కొట్టితిని, కుసుమాస్త్రకేళికి రమ్మా యని ప్రార్థింపఁగా మాటయేయాడకుంటిని, కోపగింపకువేయని నన్ను తనయాలింగనమునఁ జేర్పఁగా, ఓర్చికొనుము కొంత యంటిని. అయ్యో! యాసలమర్మ మెఱుఁగని పాపిని కాఁబట్టి, యిట్లు విభుని పోఁగొట్టుకొంటినమ్మ.

సీ॥ మోసమాయెనుగదే । మోహాతిశయమునఁ
బతి యెంత వేఁడినఁ । బలుకనైతి,
పలుకక వానిపై । యలుకచే నే నున్న
నుంచరే తిరి వాని । నుపచరించి,
యుపచరింపక మీర । లూరకుండిన నేమి
నేనె రారా యని । నిలుపరాదె,
నిలుప నాలో నేర్పు । నేర్పు లేదాయెఁబో
ప్రేమతో నతఁడెన । న్నిలువరాదె

గీ॥ యన్ని యననేల? యొకరి నే । ననఁగనేల,
తిన్నఁగాఁ జేరి నెనరు రా । విన్నవించి॥ చెలియ॥ 94

మోహాతిశయమునఁ=అధిక మోహము చేత, పతియెంత వేడినఁ=మగఁడెంతబతిమాలినప్పటికిని, పలుకనైతిఁ=మాటలాడక యేపోతిని, మోసమాయెనుగదే=మోసమువచ్చెనుగదే, వానిపైఅలుక చేతఁ=వానిమీఁదికోపము చేత, పలు

కక నేనున్నఁ=మాటలాడక నేనుండఁగా, (మీరైనను)వానిఁ, ఉపచరించి=ఉపచారములనుబలికి, ఉంచరైతిరి=నిలుపుకొనకపోతిరిగదే మీరలు, ఉపచరింపక, ఊఱకుండిననేమి, నేనే=నేనుగానే, రారాయని=రమ్మురమ్ముఅని, నిలుపరాదె=నిలిపికొనరాదా! నిలుపఁ=అట్లునిలిపికొనుటకు, నాలోనేర్పు నేర్పులేదాయెఁబో = నాలోపల నేర్చుకొనఁదగిన నేర్పరితనమే లేకుండెను, ప్రేమతోఁ=ప్రియముతో,అతఁడెనన్నిలువరాదె=అతఁడే నన్నుఁబిలువకూడదా!అన్నియననేల=అన్నిమాటలేల? ఒకరి నేనుఅనఁగ నేల=ఒకరి నేలనొచ్చుకొనవలయును, తిన్నఁగాఁ చేరి=నేరుగాపోయి, సెనరునవిన్నవించి,(పతినిదెమ్ము.)

తా. మోహమువలని యుత్కంఠచేత అతఁడు నన్ను వేఁడుకొన్నను నిలుపుకొననిది మోసమాయెనుగదే! నేనట్లు కోపాతిశయముతో నుండినప్పటికిని, మీరైన నతనికి హితోక్తులనుబలికి నిలుపుకొనియుండరాదా? మిమ్మేల చెప్పవలెను? నేనే రా రా యని తుదకు నిలిచి నిలిపికొని యుండరాదా! అట్లు నిలుపుకొను సామర్థ్యము నాకుచాలదు. అతఁడుగానైనను ప్రేమాతిశయముచే నిలిచియుండరాదా! యిన్నిమాటలేల? యిందఱి నననేల? నీవుపోయి తోయజాక్షీ విభుని తోడితెమ్ము.

సీ॥ కరుణతో నిటుమళ్ళి । కౌఁగిలింపు మటంచు
 ముదముతోఁ బలుమఱు । మ్రొక్కె నమ్మ,
యధరబింబముఁ బంటి । నదుమని మ్మనుచును
 మనవిగా నను బతి । మాలె నమ్మ,
గట్టిగాఁ జనుఁగవఁ । బట్టనీయవె యంచు
 వేమాఱులకు నన్ను । వేఁడెనమ్మ,
కాముకేళి నొకింత । కలయనీయు మటంచుఁ
 విభుఁడు మెల్లన విన్న । వించు నమ్మ,
గీ॥ యిట్లు మరులైన ప్రాణేశు । నెట్లు పాసి,
 మందబుద్ధిని నేనెట్టు । లుందునమ్మ॥ చెలియ॥ 95

టీ. కరుణతోఁ=దయతో, ఇటుమళ్లి=ఇట్లుదిఱిఁగి, కౌఁగిలింపుమటం చుఁ=ఆలింగనముచేసికొనవేయని, సుగుణతోఁ=సంతోషముతో, పలుమఱు మ్రొక్కునమ్మ=పలుతడవలకునునమస్కరించును, అధరబింబమునుఁ=పెదవియను దొండపండును, పంటనదుమనిమ్ముఅనుచుఁ=నాపంటనొక్కనిమ్ము అని, మనవి గాఁ=విజ్ఞాపనములుగా, ననుబతిమాలునమ్మ=నన్నుప్రార్థించుకొనునమ్మ, చనుగ వఁ=చండ్లజంటను, గట్టిగాఁ పట్టనీవేయనుచుఁ, వేమాఱులనుఁ=వేయిసారులకు, నన్ను వేఁడునమ్మ=నన్నుప్రార్థించుకొనును, కామకేళిఁ ఒకింతకలయనీయుము=రతినికూడనిమ్ముఅని, విభుఁడు, మెల్లనవిన్నవించునమ్మ=పతి మెల్లఁగా విజ్ఞాపించుకొనునమ్మ, ఇట్లుమరులైనప్రాణేశుఁ=ఇట్టిమోహాతిశయముగలిగినవిభుని,పాసి యెట్లు=ఎవ్విధముగానెడఁబాసి, మందబుద్ధిని=బుద్ధిహీనురాలిని, నేను, ఎట్లులుందునమ్మ=ఎట్లుజీవింతునమ్మ.

తా. దయఁగలిగి, విభుఁడు ఇటుతిఱిఁగి కౌఁగిలి యియ్యవేయని పలుమాఱు మ్రొక్కును. నీయధరమును ఆననీవే యని బతిమాలును. నీవక్షోరుహాములపీడన ముల కీయకొనవే యని వేఁడును రతికిచేరవే యని మెల్లన మనవిచేసికొనును. ట్టిపరమమోహితుఁడైనవిభునిఁ బాసి యెట్లు జీవించియుందునమ్మ.

సీ॥ ప్రాణేశుఁ బాసినఁ ◊ బ్రాణంబు లుండవు
నెలఁత! నానే నెట్లు ◊ నిలుచు నమ్మ,
పొత్తున నేకాని ◊ భుజియింప నొల్లనే
యిపు డన్న మెటు ◊ రుచియించు నమ్మ,
కౌఁగిలి వదలినఁ ◊ గడుఁ దల్లడిల్లుదు
నిదుర కంటికి నెట్లు ◊ పొదలు నమ్మ,
యలిగినఁ 'బలుకుమా' ◊ యని వేఁడుకొందునే
యువిదరో! మన సెట్లు ◊ లోర్చు నమ్మ,
గీ॥ రమణ నేనేమొ బలుచట్టు ◊ తాయి నమ్మ,
మఱచి నావలె బ్రదుక దేమగువయైన॥ చెలియ॥ 96

టీ. నెలఁత=చెలీ! ప్రాణేశున్ బాసినన్=మగని తొలఁగియుండినయెడల, ప్రాణంబులుండవు=జీవములు నశించును. మేనుఎట్లు నిలుచునమ్మ=అప్పుడు శరీరమెట్లు నిలిచియుండునమ్మ, పొత్తుననేగాని=కూడియేగాని, భుజియింపనొల్లను=తినమొదలుపెట్టను, ఇపుడు, అన్న మెటు రుచియించునమ్మ = అన్నమెట్లు నాలుకకు ఇంపుగానుండును? కౌఁగిలివదలన్=ఆశ్లేషమునుండి వీడినయెడల, కడున్ తల్లడిల్లుదున్=మిగుల హింసచెందుదును, కంటికిన్, నిదుర యెట్లు పొదలునమ్మ=ఎట్లు నిదురపట్టునమ్మ, అలిగినన్=విభుఁడు కోపగించుకొన్నయెడల, పలుకుమాయని=మాటాడుమాయని, వేఁడుకొందు నే=ప్రార్థించుకొందు నే, ఉవిదరో=ఓ యువతీమణీ! మన సెట్లులోర్చునమ్మ=నా మన స్సెట్లు శాంతినొందును? రమణన్, నే నే మొబలుచట్టుఱాయినమ్మ= నేనొక ఱాతిబండను, ఏమగువయైనన్ = ఏ కాంతయైనప్పటికిని, మఱచి బ్రదుకదు=తన మేలును మఱచి జీవింపదు.

తా. విభుని ఎడఁబాసిన జీవము లుండవు, నాశరీరము అప్పటి కెట్లు నిలిచి యుండఁగలదు. కూడియే గాని తినుటకు నొల్లని నాకు కూడు ఇప్పు డెట్లు రుచించును. పతి కౌఁగిలివదలెనో కడు తల్లడిల్లుదును. ఇపుడు కంటికి నిదుర యెట్లు తగులఁగలదు? పతి అలిగినయెడల, తోడనే కోపగింపకుము అని బతిమాలుదును. అట్టి నాకిప్పు డెట్లు మనస్సమాధానము గలుగును. నేనొక పెద్దచట్టుఱాయిని. నావలె పతిని ఏమఱచియుండునట్టి కాంత యొకతెయు నుండదు.

సీ॥ పతిరూపరేఖలు పటమున వ్రాయించి
సొంపుగాఁ గన్గొనఁ జూపరమ్మ,
హరికరంబులగంధ మప్పళించుక వచ్చి
పొంకంబుగాఁ జన్గుఁ బూయరమ్మ,
మాధవుపలునొక్కు మడుపులఁ దెప్పించి
యొప్ప నాకెమ్మోవి నుంచరమ్మ,
నలినాయతాక్షుని నఖములఁ దెప్పించి
చిగురుఁగెంజెక్కులఁ జేర్పరమ్మ,

గీ॥ పొడము మదనాగ్ని యెందుల నణఁగ దింక
నూఱకయ మీరు జాగు గా నుండఁదగునె॥ చెలియ॥ 97

టీ. పటమునన్ = చిత్రమునందు, పతిరూపురేఖల వ్రాయించి= పెనిమిటియొక్క ఆకారమును గలరేఖలను వ్రాయించి, సొంపుగాన్ =రమణతో, కండ్లకుఁ జూపరమ్మ= నాకుఁజూపి చక్షుః ప్రీతిని గలిగింపరమ్మ. హరికరంబులగంధమున్ = శ్రీకృష్ణునిచేతియందలిగంధమును, అప్పళించుక వచ్చి= చేతులనద్దికొనివచ్చి, పొంకంబుగాన్ =పొందికతో, చండ్లన్ పూయరమ్మ, మాధవుపలునొక్కుమడుపులన్ = కృష్ణునిదంతములు దవిలినయాకుమడుపులను, తెప్పించి, ఒప్పన్ =అందముగా, నాకెమ్మోవిన్ = నాయెఱ్ఱని పెదవిపై, ఉంచరమ్మ ; నలినాయతాక్షుని= తామరసనేత్రుని, నఖములన్ తెప్పించి= గోళ్లనుదెచ్చి, చిగురుకెంజెక్కులన్ = చిగురుటాకులను బోలిన యెఱ్ఱని చెక్కిళ్లయందు, ఉంచరమ్మ= పెట్టరమ్మ, పొడము మదనాగ్ని =సంభవించినమన్మథాగ్ని, ఎందులన్ అణఁగదింకన్ =ఎందుచేతను ఇంకను అణఁగదు, ఊఱకయ=మిన్నకయే, మీరు, జాగుగానుండన్ తగునే=ఆలస్యపఱచుచు నుండవచ్చునే.

తా. విభునియొక్క ఆకారరేఖలను చిత్రమున రచించి తెచ్చిచూపుఁడు. అతనిచేతుల నంటినగంధమునుదెచ్చి, నాయెద కలందుఁడు, అతనిపలునొక్కుమడుపులను దెచ్చి నామోవిమీఁదను జేర్పుఁడు. పొడలునట్టి మదనాగ్ని యెట్లు మానఁగలదు. మీరిట్లు లాలస్యము చేయనగునా?

సీ॥ వలపుమై నాప్రాణవల్లభుఁ గూడిన
పడఁతి వేయేఁడులు బ్రదుకవలయు,
కమలాక్షు నెప్పుడుఁ గౌగిటఁ జేర్చిన
కాంత కైశ్వర్యంబు గలుగవలయుఁ,
బతితోడఁ జౌశీతిబంధముల్ పచరించు
పల్లవపాణి వర్ధిల్లవలయుఁ,
గృష్ణదేవుని రతిఁ బ్రీతి నొందించిన

యువిద చల్లఁగ నెప్పుడుండవలయు,
గీ॥ ననుచు దీవించరమ్మ యెంతైన వాఁడు
సంతసించినఁ జాలు నీసారికైన॥ చెలియ॥ 98

టీ. వలపుమైక్ = మోహముతో, నాప్రాణవల్లభుక్ గూడినపడఁతి = నావిభునితోఁ (గూడిన స్త్రీ), వేయేఁడులు = వేయిసంవత్సరముల కాలము, బ్రదుకవలయుక్ = జీవింపవలయును, కమలాక్షుక్ = విష్ణుదేవుని, ఎప్పుడుక్ కౌఁగిటక్ జేర్చిన కాంతకుక్ = ఆలింగనమునందు చేర్చియుండు స్త్రీకి, ఐశ్వర్యంబుగలుగవలయుక్ = ప్రాభవముగలుగవలయును, పతితోడక్ = నాయకునితో; చౌశీతిబంధముల్ పచరించు పల్లవపాణి = వివిధరతిబంధములను గూడునట్టి కాంత, వర్ధిల్లవలయుక్ = వృద్ధిచెందవలయును; కృష్ణదేవునిక్ = శ్రీకృష్ణుని, రతిక్ = గ్రీడయందు, ప్రీతినొందించిన యువిద = తుష్టిని గలిగించినయువతి; చల్లగ నెప్పుడుండవలయుక్ = మిగుల నెమ్మదితో నుండవలయును. అనుచుక్ = అని. దీవించరమ్మ = ఆశీర్వదింపరమ్మ, వాఁడు = శ్రీహరి, ఎంతైనక్ = ఎచ్చోటనైనను, సంతసించినక్ చాలుక్ = సంతోషించినచాలును. ఈసారికైనక్ = ఈయొకతడవకైనను (చేడియా! కృష్ణుని తోడితెమ్ము).

తా. మోహాతిశయముతో నావిభునిగూడినకాంత వేయిసంవత్సరములకు ఉజ్జీవించి యుండవలెను. అతనిని కౌఁగిటను జేర్చిన కాంతకు ఐశ్వర్యావాప్తి గలుగవలయును. పతితోడ చౌశీతిబంధములను నెఱపుతెఱవ వర్ధిల్లవలెను. కృష్ణస్వామితోఁ గ్రీడించుకాంత చల్లగానుండవలయును. అని యాశీర్వదించరమ్మ. అతఁడెచ్చోటనైనను సంతోషముతో నున్నఁజాలును. ఐనను ఈయొకతూరికి మాత్ర మతని తోడితెమ్ము.

సీ॥ ప్రాణేశుఁ డెచ్చటికేపరభూమి నున్నాఁడో
యాదిత్యదేవ! కాపాడవయ్య,
సరసుఁడు వలచి యేసఖిచెంత నున్నాఁడో
యుడురాజ! పోషించు చుండుమయ్య,

వరుఁ డేనెలంతకై వనమున నున్నాఁడో
సేవింతుఁ బవన! రక్షింపవయ్య,
విభుఁ డే వెలందిని విడఁజాలకున్నాఁడో
యనిమిషోత్తములార యరయరయ్య,
గీ॥ యనుచు వేఁడెద నాతఁ డెందైన లెస్స
నున్న దే చాలు నేఁ జూడకుండ లేను॥ చెలియ॥ 99

టీ. ఆదిత్యదేవ=ఓసూర్యభగవానుఁడా? ప్రాణేశుఁడు=నాజీవితేశుఁడు, ఎట్టిపరభూమినున్నాఁడో=ఎట్టిప్రదేశమునందు ప్రవాసము చేయువాఁడో? కాపాడవయ్యా=రక్షింపుమయ్యా, ఉడురాజ=చంద్రుఁడా! సరసుఁడు=నారసికుఁడు, వలచి=మోహించి, యేసఖి చెంతన్ ఉన్నాఁడో=ఏచెలియదగ్గఱనుండువాఁడో, పోషించుచుండుమయ్యా=రక్షించుచుండుమయ్యా, పవన=ఓవాయుదేవుఁడా! వరుఁడు=పెనిమిటి, ఏనెలంతకై వనమునను న్నాఁడో = ఏస్త్రీకై వనమునందుండువాఁడో? సేవింతున్=కొలిచెదను, రక్షింపవయ్యా=కాపాడుమయ్యా, విభుఁడు, ఏవెలందిని=ఏకాంతను, విడఁజాలకున్నాఁడో=వదలలేకుండువాఁడో? అనిమిషోత్తములార=ఓదేవతలార! అరయరయ్యా=రక్షింపరయ్యా, అనుచున్ వేఁడెదన్=అని ప్రార్థించెదను. అతఁడు, ఎందైనన్ లెస్సనున్నదే చాలున్=అతఁడెచ్చటనైనను సుఖంబుండుననదే చాలును, నేను చూడకుండ లేను=అతని దర్శింపక ఉండఁజాలను.

తా. ఓసూర్యుఁడా! నాకాంతుఁ డేపరభూమిలో ప్రవాసము చేయువాఁడో? రక్షింపుమయ్యా. ఓచంద్రుఁడా! నాథుఁ డేకాంత చెంతనుండువాఁడో? పోషింపవయ్యా. పవనా! నాథుఁ డేయింతికై వనమునందున్నాఁడో? అరసి రక్షింపవయ్యా. దేవతలారా! దైతుఁ డేవెలఁదిని విడఁజాలకున్నాఁడో! యరయరయ్యా. అనుచు ప్రార్థింతును. అతఁ డెందైన సుఖముండుటే చాలును. నే నతని చూడకుండఁజాలను.